# అభ్యుదయ

ఆగస్టు 1978 ఒక రూపాయి



స్వాతంత్ర్య దీక్షకు చిహ్నం జాన్సీ లక్ష్మీబాయి

# విషయసూచిక

ఆంధ్రప్రదేశ్
అభ్యుదయ
రచయితల సంఘం
మద్రాసు శాఖ
మాసపత్రిక

# అభ్యుదయ

సంచిక 8,
సంపుటి 2
ఆగస్టు 1978
సాలు చందా
రు. – 10

# కీ. శే. నాయని సుబ్బారావు

దేవులపల్లి కృష్ణశాస్త్రి

నా 'నాయని' వెళ్లిపోవడం అన్యాయం.

నాయని నా కన్న రెండేళ్ళు చిన్న వయస్సులో. కవిత్వాన్ని బట్టి చూస్తే ఎంతో పెద్ద!

పోనీ! ఇతర కవులు అందరి కన్న నాకు అత్యంత సన్నిహితుడు.

నాయని లాగే నండూరి సుబ్బారావు కూడా. కొంత వరకు మా వేదుల.

ఎలాగ వెళ్లి పోయారో అందరూ.

మా స్వర్ణ యుగంలో వారం, 1890 – 1900లో పుట్టిన వారిలో రాయప్రోలు, అబ్బూరి, నేనూ మిగిలాం.

మొన్న ఫిబ్రవరిలో హైదరాబాదులో ఒక సన్మానానికి వెళ్లినప్పుడు, "ముగ్గురినీ సభావేదిక మీద చూడాలి; నా కన్న వృద్ధులైన రాయప్రోలు, అబ్బూరుల పాదాలకు నమస్కరించాలి; నాయనిని కౌగిలించుకోవాలి. వేదిక మీద మంత్రులూ మొదలయిన పెద్దలు వద్దు" అన్నాను.

రాయప్రోలు ఒక్కరే రాగలిగారు.

అబ్బూరినీ, నాయనినీ చూడలేక పోయాను.

నాయని ఈ పద్యం వ్రాసి పంపేరు,

"కవితా మోహాన మురళీ
వివశ సమస్తాంధ్ర జగతి! విశ్రుత కీర్తి
ప్రవిభాస! ఎనుబదేడుల
నవ కృష్ణా! కొనుము నాదు నతులివె అన్నా!"

ఎంత ప్రౌఢ సుందర వాక్కు నా తమ్ముడు, నాయనిది.

దాదాపు 55 ఏళ్ల క్రితం నన్ను చూడడానికి పిఠాపురం వచ్చాడు. అప్పుడు నాయనికి కూడ పెద్దజుట్టు – గిరజాలు ఉండేవి.

దేశం అంతా తిరిగి నవ కవుల కృతులు నేను వినిపించేటప్పుడు, నాయనివి, నండూరివి మరీ ఆవేశంతో చదివే వాడిని– "అంతశ్శమపడి పావన మగ్న గంగ"; "ఎవ్వడా క్రూర కర్మకుడు. . . ." etc

నాయనివి మరీ మరీ ఆవేశంతో.

నాయనికి నా రచనల మీద వెర్రి ఇష్టం.

1925 లో అనుకుంటా – చదువు మధ్య మానేసి జాతీయోద్యమంలో

పడిపోయి, బి. యే. పూర్తిచేయడానికి నాయని మద్రాసు వచ్చినట్లు జ్ఞాపకం, నండూరి స్కూలు మేస్టరీ మాని లా కాలేజీలో చేరాడు.

నేను దేశద్రిమ్మరినీ, బికారినీ సోమరినీ, గనుక ఊరికే మద్రాసు వచ్చాను.

ఒకనాడు బీచ్ ఒడ్డున నాకు చాలా మంచి పద్యాలు వచ్చాయి. ఒక కాగితం మీద వ్రాసి, వెంటనే పరుగెత్తాను నాయని వద్దకు — కొత్తగా కట్టిన లొయోలా కాలేజీ హాస్టలులో ఉన్నాడు.

వినిపించాను. చివరి పద్యం :

"రేయి కడుపులో చీకటి బాయ వోలె,
తమసు పెడద దివాంధ గీతము విధాన,
ఘూకరావాన వలవంత రేక రీతి,
నా విషాదమ్ములో దాగినాడ నేనె!"

ఈ పద్యం వినగానే నా తమ్ముని కళ్ళు చెమ్మగిల్లాయి. చివర పాదం వచ్చేసరికి నా చెయ్యి గట్టిగా నొక్కాడు.

నాయని ఒక్క కొడుకు పోయాడు.

నా ఒక్క కూతురూ పోయింది.

నా కూతురు పోయిన కొత్త రోజులలో, హైదరాబాదులో ఒక సభలో చిరంజీవిని సౌభాగ్యవతి కృష్ణ కుమారి — నాయని పెద్దకూతురు — అంది "పెద్దనాన్నా ! నేను ఉన్నాను గదా !" అని.

అందుకే "కృష్ణకుమారి" ఏమో.

ఆమెతో, ఆమె చెల్లెళ్లతో నేనూ దుఃఖిస్తున్నాను.

నా మరదలు "వత్సలాదేవి"కి వియోగం లేదు. ఆమెలో అంతా నాయని నిండి ఉన్నాడు గనుక.

'అభ్యుదయ' వారు నా చేత ఇది వ్రాయించి మళ్లీ మళ్లీ ఏడిపించారు.

నాయనీ ! మొన్న ఫిబ్రవరిలో నిన్ను ఒక సారి చూసినా బాగుండేది !

మా రోజులు, మా గాఢ ప్రేమ బంధాలూ ఎట్టివో చెప్పినా మీరు గ్రహించలేరు.

అప్పుడు పదవులూ, అవార్డులూ, బిరుదులూ లేవు. కీర్తి కామం లేదు, కవిత్వమే.

నాయని ఒక్కడే ఉదాత్తుడుగా చివరి వరకూ మిగిలేడు. "బిరుదు" తానే అందుకోకుండా, ఆ అభిమాని వెళ్లిపోయాడు.

పద్యాలు జీవితాన్ని చీల్చుకొని వస్తవి. అందుచేతనే అంత బాధాకరంగా ఉంటవి. గుండెలకు తగిలేటట్టు చెబుతాడు, యత్నం లేకుండా, పద్య నిర్మాణానికి పాటుపడినట్టు కనిపించడు. అదే ఈయన కళ, గొప్పది, కవిత్వం ఈయనను వరించింది. వలపులో, విరహంలో, వేదనలో, మాతృప్రేమలో. ఈయన కవిత్వానికి హృదయం గీటురాయి — ప్రియురాలి మొదటిబాటు పిచ్చివాణ్ని చేసింది. తల్లి మరణం ఘోరమనిపించింది. ఆనందంలో స్వర్గవీధులలో విహారం చేయిస్తాడు. బాధతో హృదయాన్ని బద్దలు కొడతాడు. బ్రతుకులో కవిత్వం పిండుకుంటాడు. ప్రతి పాదం జీవించే పలుకుతాడు. ఈయన గీతాలు ఉజ్జ్వలములూ ఉన్నతములూ.

('వైతాళికులు' నుండి).

# సేండోర్ పెటోఫీ
## హంగెరీ స్వాతంత్ర్య వైతాళికుడు
### కాట్రగడ్డ గంగయ్య

హంగెరీలోని ఒక కుగ్రామంలో, కసాయి వృత్తితో జీవించే నిరుపేద కుటుంబంలో పుట్టి, 26 సంవత్సరాలు నిండని వయసులో జాతీయ స్వాతంత్ర్య విప్లవ పోరాటంలో మరణించిన సేండోర్ పెటోఫీ విశ్వసాహిత్యంలో విశిష్ట స్థానాన్ని పొందిన మహాకవి. బ్రిటిష్ రచయిత థామస్ కార్లైల్, జర్మన్ మహాకవులు హెన్రిక్ హైనె, థామస్ మాన్, ఇటాలియన్ కవి కార్డూచీ మెప్పును పొందినది కవిగా పెటోఫీ విశిష్టత.

బ్రిటిష్ చరిత్రలో స్వాతంత్ర్య పిపాసకు ప్రతీకలైన ప్రఖ్యాత కవులు బైరన్ (1788 - 1824), షెల్లీ (1792 - 1822) తరహా కవి అని పెటోఫీ గురించి విజ్ఞుల అభిప్రాయం.

ఎంతో కాలంగా తన దేశాన్ని సర్వవిధాలా తరతరాలుగా దోచుకుంటోన్న హాప్స్‌బర్గ్, ఆస్ట్రియన్ రాచరికాల దుష్ట పరిపాలనకు వ్యతిరేకంగా పెల్లుబికిన జాతీయ స్వాతంత్ర్య విప్లవ పోరాటంలో పాల్గొంటూ పెటోఫీ మరణించారు.

పెటోఫీ, హంగెరీ దేశంలో చిరస్మరణీయుడైన జాతీయ మహాకవి. ఆ దేశంలో ఎక్కడికెళ్ళినా, యీ నాటికీ పట్టణాలలోనైతేనేమి, మారుమూల పల్లెలలో నైతేనేమి స్మృతి చిహ్నంగా ఆయన విగ్రహమో, ఆయన పేరున్న వీధో, కూడలి స్థలమో కనిపిస్తుంది. పెద్దల నుండి పిన్నల వరకూ ఆయన రచనలను ప్రీతితో చదివే వారే.

ఎనిమిది వందలకు పైగా పద్యాలూ, రెండు నాటకాలు, ఒక నవల, ఎన్నో గద్యరచనలు, వీటికి తోడు యితర భాషలనుంచి తన హంగేరియన్ భాషలోనికి చక్కని తర్జుమాలు - విశ్వ సాహిత్యానికాయన సంక్రమింప జేసిన సంపద.

కొడుకుకు పెద్ద చదువులు అబ్బాలని, తండ్రి నాలుగు ఏండ్లల్లో ఐదు బడులు మార్పించాడు. ఉన్న ఊళ్లో వీలు పడకపోతే, పరాయి ఊళ్ళకు ఎంత దూరమైనా భారమైనా పంపాడు. అప్పట్లో పెతోఫీ వయస్సు పది నుంచి పధ్నాల్గు సంవత్సరాలు మాత్రమే.

ప్రతి చోటా వచ్చిన పెద్ద చిక్కేమంటే - హంగేరియన్ భాష అంటే ఆ కుర్రాడికి గల అమిత ప్రేమ, ప్రావీణ్యత. కొన్ని చోట్ల, ఆ భాషను బోధించే సమయంలోతప్ప మరే సందర్భంలోనైనా విద్యార్థులు ఆ భాషలో మాట్లాడడం నాటి ఉపాధ్యాయులు సహించేవారు కాదు. ఇందువల్ల పరాయి పాలన క్రింద మగ్గే మాతృ దేశం, మాతృ భాష - ఈ రెంటిపైనా పెటోఫీకి మరింత అనురాగం, ఆసక్తి కల్గాయి. బాధలు పడడమేగాక, వాటిని ఎదుర్కొనే ధైర్యం, దీక్ష, వాటితో

పాటు ప్రపంచజ్ఞానం ఆ లేత మనసుతో నాటుకపోయాయి.

రాను, రాను బడి అనేది ఓ బందిఖానా అనే భావం పెరిగింది. రంగ స్థలంపై నటుడు కావాలనే కుతూహలం ఆయనకు ఎక్కువైంది. 15వ ఏట, పరీక్షలు పూర్తి కాకుండనే ప్రధాన ఉపాధ్యాయుని వద్దకు వెళ్ళి, తన నిర్ణయాన్ని ఆయన వెల్లడించాడు. దేహ శుద్ధి చేయడమేగాక, తండ్రికి వెన్వెంటనే యిది తెలియజేయబడింది. తండ్రి హుటాహుటిన వచ్చి, కొడుకును చావగొట్టాడు. ఆ ప్లాన్ అంతటితో ఆగిపోయింది.

పరీక్షలు పూర్తి చేసి, యింటికి తిరిగి వచ్చాడు. అక్కడి పరిస్థితులు కుంగదీశాయి.

పరీక్షలలో మంచి మార్కులు రావడం వల్ల విద్యార్థి వేతనం యిచ్చారు. మళ్ళీ బడికి వెళ్ళాడు. ఆ ఊరికి టూరింగ్ నాటకాల వాళ్ళు వచ్చారు. పెటోఫీ ప్రతి రోజు అక్కడ హాజరయ్యేవాడు. చదువులపై అశ్రద్ధ ప్రారంభమయ్యింది. చివరికి స్కాలర్‌షిప్ రద్దయ్యింది. కడుపు నిండా ఒకపూటైనా తినగలిగే అవకాశం లేకండా పోయింది. గొరుచుట్టుపై రోకటిపోటన్నట్లుగా తండ్రికి బాధ కలిగి కొడుకును తెగతిడ్తూ ఉత్తరం రాశాడు.

దానితో చదువుకు స్వస్తి చెప్పి నాటకాల కంపెనీలో చేరాడు. ఇచ్చిన పనులన్నీ చేశాడు – నటులకు టిఫిన్లు, పానీయాలూ అందించడం, ప్రదర్శన సమయంలో నాటకానికి వచ్చిన పెద్దల గుఱ్ఱపు బళ్లకు కాపలా కాయడం. ఇచ్చే జీతం కాఫీ నీళ్ళకు కూడా చాలేది కాదు. అయినా, పెద్ద పెద్ద నటులను కళ్ళారా చూచే భాగ్యమే జీతమనుకున్నాడు. కాని ఎన్నాళ్ళకూ నటించే అవకాశం కనబడలేదు. సైన్యంలో చేరిపోయాడు.

ఇన్ని కష్టాలలోవున్నా, పుస్తకాలు చదవడంగాని, పద్యాలు వ్రాయడంగాని అతడు మానలేదు. పని ఎక్కువ, ఫలితం తక్కువ. ఆరోగ్యం బాగా దెబ్బ తిన్నది. విసిగి వేసారి చివరకు సైనిక వృత్తికి కూడా సెలవు చీటి యిచ్చాడు.

అక్కడ కూడా తిరిగి తిరిగి చివరకు ఒక సాహిత్య పత్రికలో తర్జుమాదారుడుగా చేరాడు. క్రమంగా అతనికి ప్రతిభ ప్రజల దృష్టికి వచ్చింది.

పెటోఫీ 15వ ఏట, డాన్యూబ్ నది వరదలవల్ల ఆయన తలితండ్రుల కున్న కొద్ది 'ఆస్తి' కొట్టుకుపోయింది. కుటుంబం మరింత చిక్కుల పాలైంది. వారికి భారం కాకూడదని పెటోఫీ యిల్లు విడిచి, అర్ధరాత్రి సమయంలో పెనుతుఫానులా మంచు కురుస్తోంటే, చేత చిల్లిగవ్వ లేకండా, దుఃఖ భారంతో, నాటి హంగేరీ ముఖ్యపట్టణం పెస్ట్‌కు వెళ్ళిపోయారు.

ఆకలితో అలమటిస్తూ, విద్యాభ్యాసానికి అలమటిస్తూ, కేవలం స్వయం కృషి ద్వారా విద్యనభ్యసించారాయన. తన మాతృభాషలోనే కాకుండా జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్, ఇంగ్లీషు మొదలైన భాషలలోనూ ప్రావీణ్యం సంపాదించారు. ఆ భాషలలోని ప్రసిద్ధ రచనలు చదివి, స్వతంత్ర రచనచేసే నైపుణ్యాన్ని, అనువదించే శక్తినీ సంపాదించుకున్నారు.

షేక్స్పియర్ రచనలను అనువదించిన ప్రముఖుల అగ్రశ్రేణిలోనిది

ఆయన స్థానం. షేక్స్పియర్ పట్ల ఆయనకుగల గౌరవాన్ని, 1847లో ఆయన చెప్పిన మాటలు నిరూపిస్తాయి: "షేక్స్పియర్!" ఈ పేరే గనక పర్వతమైతే, అది హిమాలయాలకన్నా ఎత్తయ్యేది. అదే సముద్రమైతే అట్లాంటిక్ కన్నా లోతూ, విశాలము గలదయ్యేది. ఆదే నక్షత్రమైతే సూర్యునికంటె ప్రకాశ వంత మయ్యేది!"

సామాన్య ప్రజలకందుబాటులో వుండేటట్లుగ, వారి నుడికారంలో వుంటాయి పెటోఫీ రచనలు. ఛాందసులు కొందరు ఆయన శైలినీ, భావాలనూ తీవ్రంగా విమర్శించారు. అయితే పాఠకలోకం, ముఖ్యంగా సామాన్య ప్రజలు ఆయనను ఆరాధించారు.

ప్రేమ, ప్రకృతి సౌందర్యం, స్వాతంత్ర్య ప్రజా స్వామ్యాలకోసం ప్రజా సమీకరణ — యీ మూడూ ప్రధానంగా ఆయన రచనలకు వస్తువులు.

"పద్యాలే నా ఆయుధాలు! ఒక్కొక్క పద్యం కదనరంగంలో నా ప్రక్కన నిలిచే తోటి యోధుడు" అని ఆయన నిర్వచించారు. ఆయన యీ క్రింది విధంగా ఎలుగెత్తి చాటారు: "స్వాతంత్ర్యం, ప్రేమ - యీ రెండూ లేకుండా నేనుండ లేను. ప్రేమకోసం జీవితమైనా యిచ్చేస్తాను. కానైతే, స్వాతంత్ర్యం కోసం ప్రేమను కూడా త్యాగం చేస్తాను".

కేవలం ఆరు పంక్తులు మాత్రమేఉన్న యీ చిన్న పద్యం వాడ వాడలా దావానలంలా ప్రాకిపోయి, ప్రజలను పోరాటానికి పురిగొల్పింది.

తరవాత ఆయన వ్రాసిన "జాతీయ గీతం" విప్లవశంఖారావం అయ్యింది: "దేవుని పేరిట శపథం చేస్తున్నాం, మేం శపథం చేస్తున్నాం! బానిస గొలుసులను యింకెంత మాత్రం సహించం!" అనే పల్లవితో 6 పద్యాలుగల యీ

## లేవండి, మగియార్స్!★

### సెండోర్ పెటోఫీ

లేవండి, మగియార్స్, మీ దేశం
పిలుస్తోంది!
ఏదేమైనా వేళయ్యింది ఉద్యుక్తులవండి!
స్వతంత్రులుగానా, బానిసలుగానా
ఉండేది? — తేల్చుకోండి.
మీ ఆత్మాభిలాషను అనుసరించండి! -
హంగెరీ దైవసాక్షిగా
బానిసబంధాలిక భరించలేము
ప్రమాణ పూర్తిగా!

మన పెద్దలకు సిగ్గుచేటుగా
చిరకాలం బానిసలం మనం
స్వతంత్రులుగా జీవించి, గతించారు వారు
వారి అస్థులున్నది బానిస సమాధులో
కాదు.

హంగెరీ దైవసాక్షిగా
బానిస బంధాలిక భరించలేము
ప్రమాణపూర్తిగా!

దేశ జీవన రక్ష కొరకు
ప్రాణార్పణ చేయనివాడు దుష్టుడు.
తన అల్ప జీవాన్ని స్వీయాకాశపథం
కన్న

★ మగియార్స్ అన్న మాట హంగేరియన్లకింకో పేరు

"జాతీయ గీతం" ప్రజల హృదయాలపై చెరగని ముద్ర వేసింది - నాడు నేడూ కూడా!

తన 23 వ ఏట జూలియా అనే కలవారి అమ్మాయితో పెటోఫీకి పరిచయం అయ్యింది. అనతికాలంలోనే అది ప్రణయంగా మారింది. ఏడాది తిరుగక ముందే ఆమె తలిదండ్రులు నిరోధించినా, వారి వివాహం జరిగింది. వివాహానంతరం, ఆమెకు అంకితమిస్తూ 1848 లో వ్రాసిన రెండు ప్రేమగీతాలు "నిన్నేమని పిలిచెద ?" (50 చరణాలు); "ప్రేమిస్తున్నాను, ప్రియతమా, నిన్నే ప్రేమిస్తున్నాను" (80 చరణాలు) - యీ ప్రేమగీతాలు గత 130 సంవత్సరాలుగా, హంగేరీ దేశంలో యువ హృదయాలను, ప్రేమికులను స్పందించే, సమ్మోహపరిచే సాటిలేని మధురగీతాలుగా వున్నాయి.

"పంపండి ఉరికంబానికి - రాజుల్నందరినీ!" అని ఆయన యిచ్చిన నినాదం (ఓ పద్యంలో చరణం) వాడ వాడలా ప్రతిధ్వనించేది. పాలకుల ఆగ్రహానికి అంతులేదంటే ఆశ్చర్యం లేదు. వారి దురాగ్రహానికి యీ మహాకవి సహజంగా గురి అయ్యారు.

"కావాలి యీ లోకమే ప్రజలకు స్వర్గం! పంచాలి భూమినంతా ప్రజలకే" అని మరో గీతంలో ఉద్బోధించారు పెటోఫీ.

ఈ కోరిక మాత్రం ఆయనకూ, ఆయన తరంవారికీ కలగానే నిలచి పోయింది. తరువాతి తరాల వారు సమిష్టి కృషితో, సంఘటిత శక్తులుగా రూపొంది, రాజకీయ స్వాతంత్ర్యంతోబాటు ఆర్థిక స్వాతంత్ర్యం, నిజమైన ప్రజాస్వామ్య ప్రాతిపదికపై సోషలిస్టు హంగేరి అవతరణకు మార్గం సుగమం చేసుకున్నారు. ఈ పరివర్తనకు పెటోఫీ రచనలు పదునైన ఆయుధాలుగా ఉపకరించాయి. ఉజ్వల భవిష్యత్తుకు బాటలు వేసుకొంటున్న సోషలిస్టు హంగేరీ ప్రజలకు నేటికీ పెటోఫీ రచనలు ఉత్సాహాన్నీ, ఉత్తేజాన్నీ కలిగిస్తున్నాయి.

మిన్నగా ఎన్నుకొనేవాడు దుష్టుడు
హంగెరీ దైవసాక్షిగా
బానిస బంధాలిక భరించలేము
ప్రమాణ పూర్తిగా !
సంకెల కంటె కత్తి పేడయినది -
స్వేచ్ఛాజీవి చేతికి అనువయినది
అయినా సంకెళ్లు, కట్టు తాళ్లూ
భరించాము
ఇకనివ్వండి మాకు మా కత్తులు!
హంగెరీ దైవసాక్షిగా
బానిస బంధాలిక భరించలేము
ప్రమాణపూర్తిగా !

మరలి వస్తాయి మగియార్ పేరుకు
అందచందాలు, ప్రాచీన కీర్తి ప్రతిష్ఠలు
ఈ దుష్ట శకాలు రూపుమాసిపోతాయి
సమరంలో వాటిని నిశ్శేషం చేస్తాము.
హంగెరీ దైవసాక్షిగా
బానిస బంధాలిక భరించలేము
ప్రమాణ పూర్తిగా !

గడ్డి మొలిచిన సమాధుల్లో మేము
నిదురించిన చోట మాబిడ్డలు మా పేర్లన్నీ
భద్రపర్చుతారు పవిత్ర స్మృతిగా
మా నిశ్శబ్ద భస్మానికి మోకరిల్లుతారు.
హంగెరీ దైవసాక్షిగా
బానిస బంధాలిక భరించలేము
ప్రమాణ పూర్తిగా,
ప్రమాణ పూర్తిగా !

(ఆంగ్లం నుండి అనువాదం : 'అభ్యుదయ')

# రాజకీయం దెబ్బతింది

**కథానిక**

పసుపులేటి రామారావు

మున్నాడు నెలల్లో పంచాయితీ ఎన్నికలనే వార్త ఆ వూరంతా రివ్వున వ్యాపించింది. కొందరినది చల్లని పిల్ల తెమ్మెరలా ఆహ్లాద పరచింది. మరి కొందరిని వడగాడ్పులా చెళ్లున దెబ్బ కొట్టింది. ఏమాత్రమూ చలనం కలుగ చేయలేదు, కొందరు ధన్యజీవులకు! ఆ వూరి చరిత్రలో ఇది చెప్పుకోవల్సిన విశేషమే మరి!

ఆ వూళ్ళో ఒక కులానికి బాగా డబ్బు ఉంది. ఆదికాలం నుండీ ఆ వూరిని ఏలుతున్నదీ వారే! భుజాలకు భుజకీర్తుల్లా - పదవులు, అందమైన పాదరక్షల్లా కాళ్ళ క్రింద అధికారాలు, చేతిలో డబ్బనే - తళతళ లాడే వజ్రాయుధం! వీటికి అదనపు అలంకారంలా మధుపానం. అదిలించే వాడు లేడు. అడ్డగించే వాడు అసలే లేడు.

ఇన్నేళ్ళ పాలనలో వారు చేసిందే విటయ్యా అంటే, వూర్నుండి పట్నం పోవటానికి అడ్డంగా వున్న పెద్ద కాలువకు వంతెనను రానీయక పోవటం, ఆ వంతెన వస్తే పట్నం నుండి దొంగలు, రౌడీలు వూళ్ళోకి చేరుతారట. వూరికి ఉత్తరాది నున్న స్మశానాన్ని పొలాల్లోకి కలిపేసుకోవటం. స్మశానంలోని మట్టిని త్రవ్వి అక్కడే ఇటుకలు చేసి ఇటుక బట్టీలు పెట్టేయడంతో, ఆ స్మశానం - నక్కలు, రాబందులు పీక్కుని తినేసిన ఎముకల పోగులా వుంటుంది. వర్షం వస్తే పుర్రెలు, పందులు తేలిపోతూ - చిన్న సైజు చెరువులా కనపడుతుంది. ఆ పెద్ద వారికి వేరే పెద్ద స్మశానం వుంది కనుక దీని సంగతవసరం లేదు.

ఈ వూరి నడి మధ్యన మంచి నీళ్ల చెరువుంది. మా చిన్నప్పుడయితే అందులో మంచి నీళ్ళుండేవి కాని, ప్రస్తుతం గేదెలు కడగటానికి, ఒడ్డున పందులు దొర్లటానికి వుపయోగిస్తోంది. ఆ పెద్ద లందరికీ ఇళ్ళల్లోకి బొంబాయిలు, నూతులూ వుంటాయి కనుక వారికి దాని సంగతవసరం లేదు. ఒరిగి ఒగ్గయిన ముసలమ్మలా బడి. దేశంలో ఎన్ని మార్పులొచ్చినా కాని, ముప్పయ్యేళ్ళుగా మారని మట్టి రోడ్డు.

ఈ మార్పులేని బ్రతుకుల్లోను, పాము పడగ నీడవంటి ఆ నిరంకుశుల పాలన క్రింద, చస్తూ బ్రతుకుతున్న ఆ జీవచ్ఛవాల కడుపుల్లో అగ్నిపర్వతాలు మండున్నాయి.

ఐదేళ్ళ క్రితం ఇలాగే ఎన్నికలన్నారు. కుంచం బియ్యం రూపాయిన్నరయినంత సంతోష పడిపోయారు జనం. అయితే రాజకీయం చివరకు కధను అడ్డం తిప్పేసింది.

ఆ పెద్ద కులంలో ఓ పెద్ద కుటుంబ, ముంది. అదే మేం పుట్టక మునుపు పుట్టాక కూడా పెసిడెంటు పదవిని మోస్తున్నది. ఆ పదవి మీద మరెవ్వరికీ ఇన్నాళ్ళుగా మోజు పుట్టలేదా అనొచ్చు. ఏన్నో ఏళ్ళుగా పోలీసోళ్ళకి పెద్ద బాసుగాను, ఇన్‌కమ్ టాక్సు వాళ్ళకి

ప్రియమిత్రుడు గాను, రౌడీ మూకకు తిరుగులేని నాయకుడుగాను సిద్ధపడ్డ నారాయణగారంటే బాగా డబ్బున్న వాళ్ళకి కూడా భయమే; అంచేత ఆయన పదవి జోలికి పోరు.

ఈ ప్రెసిండెంటు నారాయణ గారికి రామ్మూర్తనే తమ్ముడున్నాడు. వీరికో ఎనభై ఏళ్ళ తల్లుంది. ఆ తల్లికి పది ఎకరాల మాగాణి, లక్ష రూపాయిల దాకా వడ్డీలు తెచ్చిన సొమ్ము, నాలుబళ్ళ ఇత్తడి, వెండి మొదలయిన తాకట్టు సామానులున్నాయి. ఆ మధ్య ఆవిడ పోతూ పోతూ ఈ ఆస్థినంతా ప్రెసిం డెంటు నారాయణ కిచ్చిపోయింది. దీన్తో రామ్మూర్తి గుండెల్లో మంటలు బయలు దేరాయి.

ఆ దెబ్బతో లేబరు పక్షాన కొచ్చే సాడు. వాళ్ళే నా ప్రాణం, నా బ్రతుకు అన్నాడు. పిచ్చి జనం పొంగిపోయారు. రామ్మూర్తికి సర్వం తామై నిలిచారు. ఆ అన్నదమ్ముల పోటీ తీవ్రతకు వూరంతా అట్టుడికి పోయినట్లు వుడికి పోయింది. ప్రజలంతా హడలెత్తారు. ఎక్కడ నోరు మెదిపితే ఏమవుతుందోనని ప్రాణాలు అరచేతిలో పెట్టుకున్నారు.

నారాయణకు పై వర్గమంతా అండగా వుంది. నోట్లూ, మందు కుమ్మ రించేస్తున్నారు.

ఎవరు గెలిచినా రెండోవాడు వూర్ని తగల పెట్టేస్తాడనే భయం పట్టుకుంది జనానికి. అలాంటి పరిస్థితిలో-

ఎల్లుండి ఎలక్షననగా బాంబులాంటి వార్త బయటకొచ్చింది.

అది - రాజీ!!

అన్న తమ్ములిద్దరూ రాజీ అయి పోయారు.

ఈ ఎలక్షను వల్ల స్నేహాలు, బంధుత్వాలు త్రెంచుకున్న వాళ్ళు, ఇంట్లోని డబ్బును మోహర్బానీకి కాల్చేసుకున్న వాళ్ళు వెర్రి వెధవలై, కళ్ళు తేలేసి, నోరు ఆవలించారు.

"ఈ లేబరు నాయాళ్ళంతా వూరికే డబ్బుని తినేస్తున్నారు, త్రాగేస్తున్నారు. అనవసరంగా వీళ్ళని మేపేస్తున్నాం. అక్కడ తిని వీళ్ళకి ఓటేస్తారు. ఇక్కడ తిని వాళ్ళకి ఓటేస్తారు. మనం మనం ఒకటే. మనకో కట్టుబాటు, క్రమం ఉండాలి. వాళ్ళకు లోకువై పోకూడదు" అని కూకలేసి, వచ్చే అసంబ్లీకి నారాయణ గారు ఎమ్మెల్యేగా నిలబడతారని, అప్పుడు ప్రెసిడెంటు పదవిని రామ్మూర్తికి మార్చేసేటట్లుగా నిర్ణయించి, రామ్మూర్తిని ఒప్పించి రాజీ చేయించారు.

'లేబరు నాయాళ్ళకు' అప్పుడు కళ్ళు తెరుచుకున్నాయి.

ఇదీ ఆనాటి ఎన్నికల గాథ!

మళ్ళీ ఇప్పుడు ఎన్నికలంటున్నారు. క్రింద తరగతి ప్రజలకు ఎలాగయినా ఎన్నికలు జరిపించాలని పట్టుదలవుంది. కానీ, ఆ అన్నదమ్ములకు ఎదురు నిలిచే వ్యక్తి లేడు వాళ్ళకు.

అలాంటి సమయంలో-వూరికంతటికి జమీందారయిన సూరయ్య నేనున్నా నంటూ ముందు కొచ్చాడు. ఇతను అసలు రాజకీయాలంటే తెలీని మనిషి. సూరయ్యకు నారాయణగారి కుటుం బానికి ఆగర్భశతృత్వం. వీళ్ళకీ వాళ్ళకీ బంధుత్వం వుంది. అయితే ఎప్పుడో వచ్చిన ఆస్తి పంపకాల శతృత్వం అలాగే ఉండిపోయింది.

సూరయ్య రంగంలోకి రాగానే వూరంతా వేడెక్కింది. ప్రతీ వార్డుకు కత్తిలాంటి కుర్రాళ్ళను నిలబెట్టారు.

వార్డు వార్డుకీ విపరీతమైన ప్రచారం మొదలెట్టారు. పిడుగులాంటి సూరయ్యా గారి కుట్రాళ్ళముందు, నారాయణ మెంబర్లు ముసలీ, ముతకా అవటంతో పరిస్థితి సూరయ్యా వైపుకే అనుకూలంగా వున్న సమయంలో చరిత్ర గిర్రున తిరిగి వచ్చింది. మళ్ళీ – 'రాజీ'

కసాయి వాణ్ని నమ్మిన గొర్రెలకు తలతిరిగి పోయింది. సూరయ్యాను సమితి ప్రెసిడెంటు చేస్తానన్నాడు – ఎమ్మెల్యే నారాయణ. అంతే. బేరంలో అగర్భశత్రుత్వాలు, పగలు, పట్టు దలలూ నీరుకారిపోయాయి.

రాజీ అయి సూరయ్యా, నారాయణ విందులు గుడిచారు.

కానీ సూరయ్యా నిలబెట్టిన కుర్ర వార్డు మెంబర్లు తెల్లవారేసరికి వూళ్ళో ఒక్కడూ లేడు.

పూరూ, వాడా, చుట్టు ప్రక్కల ఇళ్లూ అన్నీ వెదికారు. ఏ ఒక్కడూ ఎక్కడా దొరకలేదు.

ఎలక్షను రోజున ఉదయం ఆరు గంటలకు పోలీసుల సహాయంతో వార్డు మెంబర్లు ఏడుగురూ దిగారు.

సాయంకాలాని కల్లా ఎలక్షను ప్రశాంతంగా జరిగి పోయింది, ఏడు వార్డుల్లోనూ.

రాజకీయానికి దిమ్మ తిరిగిపోయింది.

మీసాలు మెలితిరిగిన పెద్ద ఒక్కడూ బయటకు రాలేదు ఆరోజు. ఆనాటినుండే వూరి పెద్ద వీధి మధ్యలో వున్న శివాలయం అరుగు మీద కూర్చుని కబుర్లు చెప్పుకోవటం మొదలెట్టారు, అంతమందీ ధైర్యంగా.

## చేదు నిజాలు! . . . . . రాధేయ

వాడు
పాలేరు రంగడు
పెద్దిరెడ్డికి ఆజ్ఞాబద్ధుడు
రెండు జతల కాడెడ్ల పని
అవలీలగా ఒక్కడే చెయ్యగలడు
కామందుల వారికి కాళ్ళు పట్టడంలో
వాడికి వాడే సాటి
రంగడి పెళ్లాం రత్తి
రెడ్డి భార్యకు కుడి భుజం
సహనానికి మరో రూపం
ఆ తల్లి చింకి కోక దానం చేస్తే
చాలు కొండంత సంబరం తనకు
ఆ పెద్దింట్లో వారంతా
తినగా మిగిలిందే
మహా ప్రసాదంగా
కళ్ల కద్దుకుంటా రిద్దరూ
యజమానికి ఏమాత్రం కష్టమొచ్చినా
కంట నీరు పెట్టక మానరు . .

కానీ . . ఆ జంటకు తీరని బాధ
భరించలేని వ్యథ ఒక్కటే
రత్తితో ఊసులాడే తీరిక
రంగడికి లేదు
రంగడిని తృప్తిగా చూసుకొనే
హక్కు రత్తికి లేదు
కాలు విరిగినా
కళ్లు పోయినా
తమను తాము పరామర్శించుకొనే
తాహతు లేదు.
కౌగిలించుకొని
కరువుదీరా ఏడ్చే వరం
వారి కెప్పుడో?

# గాథా సప్తశతి

## శాతవాహనుల కాలంనాటి సామాజిక పరిస్థితుల చిత్రణ

కంభంపాటి సత్యనారాయణ

"గాథాసప్తశతి" పురాణమూ కాదు, ప్రబంధమూ కాదు, ఇతిహాసమూ కాదు. ఇది సుమారు 700 గాథల సంకలనం. గాథ అనగా, గానం చేయదగినది. ప్రాచీనులు వీటిని పాటలుగా పాడుకొనే వారేమో.

ఈ గాథలను సేకరించి సంకలన మొనర్చినది హాలుడనే శాతవాహన రాజు. క్రీ. పూ. 221 నుంచి క్రీ. శ. 218 వరకు 439 సంవత్సరాలు రాజ్యమేలిన శాతవాహన చక్రవర్తులలో హాలుడు క్రీ. శ. 19 నుంచి 24 వరకు పరిపాలించాడు. శాతవాహన సామ్రాజ్యం దాని అత్యుచ్ఛ దశలో దక్షిణాపథమంతా వ్యాపించింది. దాని రాజధాని పైఠాన్. ఇది మహారాష్ట్ర దేశంలో ఉంది. హాలుని కాలంలో అమరావతి (గుంటూరు జిల్లా) రెండవ రాజధానిగా ఉండేది.

### ప్రాకృత భాష(లు)

"గాథాసప్తశతి" ప్రాకృతంలో రచింపబడింది. పూర్వం మన దేశంలో ప్రాకృత భాష అనేక రూపాలలో బహుళంగా వ్యాప్తిచెందింది. "శిష్టులు" దాని అనంత శబ్దరూపాలలో కొన్నిటిని శాసనబద్ధ మొనర్చి సంస్కరించగా, అది సంస్కృత మయింది. తక్కిన వాటిని వారు వదిలివేశారన్న మాట. అలా అనేక రూపాలను "శిష్టులు" వదలివేసినా, జనసామాన్యం వాటిని విడిచి పెట్టలేదు. సహజంగా అవి దేశకాలానుగుణంగా మార్పులు చెందేయి.

సంస్కృతం లాగే దేశ భాషల్ని కూడా కొందరు నియమబద్ధ మొనర్చేటందుకు కృషిచేశారు. దేశ పరంగా వాటిని మహారాష్ట్రి, శౌరసేని, గౌడి, లాటి, మాగధి, పైశాచి, అవంతి, అర్ధమాగధి, ప్రాచ్య, బాహ్లీక, దాక్షిణాత్య మొదలైన పేర్లతో విభజించారు. ఇవన్నీ "ప్రాకృతాలు" అను సామాన్య నామంతో వ్యవహరింపబడేవి. వీటిలో కల్లా ఉత్తమమైనది మహారాష్ట్రి అని ఆచార్య దండి అభిప్రాయం. బహుశ "గాథాసప్తశతి" యీ ప్రాకృతంలోనే రచింపబడి వుండవచ్చు. కాలక్రమంలో యీ ప్రాకృత భాషలు నశించడానికి కారణ మొకటై యుండవచ్చు: అవన్నీ విభిన్న వ్యవహారాల స్వరూపాల సమ్మిశ్రయాలు. అందుచేత వాటిని సంస్కరించి నియమబద్ధ మొనర్చే ప్రయత్నం విఫలమై యుండవచ్చు. ఏది యేమైనా, ఒకటి మాత్రం నిశ్చయం. అదేమంటే, నేటి వ్యావహారిక తెలుగు భాష వలె, నాటి ప్రాకృత

భాషలు సంస్కృతానికెదురు తిరిగి కొంతకాలమైనా నిలబడ గలిగాయి. హాలుడు చక్రవర్తి అయినా "శిష్టు"ల భాష అయిన సంస్కృతంలో కాక, జన సామాన్యం మాట్లాడు కొనే ప్రాకృతం లోని గాథల్నే సేకరించి సంకలన మొనర్చాడు. ఇది అతని వివేచనాశక్తిని తెలియజేస్తుంది. అంతే కాదు. హాలుడే తన పేరుతో రచించిన గాథలు 35, శాలివాహనుని పేరుతో రచించినవి 13, మొత్తం 48 గాథలు యిందులో ఉన్నాయి. ఆనాడు ప్రాచుర్యంలో ఉన్న కోటి గాథల్లో ఏడు వందల గాథల్ని తాను ఏర్చికూర్చినట్లు అతడు ఈ గ్రంథంలో చెప్పుకొన్నాడు.

**గాథ లొక్క-కోటి గలవు లోకంబున ;**
**వానిలోన నందమైన వాని**
**నేర్చి కూర్చిపెట్టె ఏడు నూఱులు కవి -**
**వత్సలుండు శాలివాహనుండు (గాథ 3)**

## 300 మంది కవుల కృతులు

ఇందు సంగ్రహించిన గాథలు సుమారు ఏడు వందలే అయినా, వాటిని రచించిన కవులు, యించు మించు మూడు వందలు! శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు 274 గురు కవుల పేర్లను గుర్తించారు. వారిలో కొందరు తెలుగు వారున్నారని సుల భంగా గ్రహించవచ్చు : అంధుడు, ఇందుడు, (ఇంద్రుడు), కమలుడు, కేసవుడు (కేశవుడు), గోవిందస్వామి, దుర్గరాజు, దేవరాయడు, నారా యణుడు, భీమస్వామి, మాధవుడు, రాఘవుడు, రాముడు, శేఖరుడు, సుందరుడు, సూరణుడు, సూరుడు.

పురుషులే కాక, స్త్రీలు కూడా చక్కని కవిత్వం చెప్పేవారు. వారిలో కొందరు అణులచ్ఛి, అసులద్ధి, పహాయీ, భేజ్జా, మాధవి, రేవా, రోహా, వద్ధా వహీ, వోహా, ససిప్పహా.

శ్రీ అనంత కృష్ణశర్మగారు పండి తులు, కవివర్యులు, బహు భాషావేత్తలు. వారు ప్రాకృత మూలం నుంచి 734 గాథలను సంగ్రహించి, తెలుగు పాఠకులకు రుచించే ఆటవెలది, తేటగీతి, కంద పద్యాలలో తెనిగించారు. వాటిని ఆంధ్ర సారస్వత పరిషత్తువారు (హైద రాబాద్) 1964లో "శాలివాహన గాథాసప్తశతీ సారము" అను శీర్షికతో ఒక సంపుటాన్ని ప్రచురించారు (ఈ నా వ్యాసంలో ఉటంకిస్తున్న పద్యాలు ఆ గ్రంథంలోనివే).

## "గాథాసప్తశతి" విశిష్టత

'గాథాసప్తశతి' శృంగారరస ప్రధా నమేగాని దేశీయుల దైనందిన జీవితమే యిందులో ప్రధానంగా ప్రతిబింబిస్తుంది. ఊహించి ఊహించి ఎంత విపరీతమైన అతిశయోక్తులకు పోయినా, ఏ ఒక్క గాథ యదార్థ జీవిత వాసనను వదలి పెట్టదు. కవులందరూ ఎంచుకున్న విషయాలు సహజమైనట్టివి. జీవితయదా ర్థాలను బయట పెట్టేవి. ప్రబంధాల్లో లాగ వీటిలో నాగరక వాసన యిసు మంతైనా కానరాదు. శృంగారం పేరుతో స్త్రీల అంగాంగ పరిశీలనలు, సంభోగ వర్ణనలు, తుచ్ఛపు తలపులు, అంతకంటె తుచ్ఛమైన పలుకులు ఎక్కడా కనబడవు. అడుగడుగున మనకు ప్రత్యక్షమయేది గ్రామీణుల జీవితం, వారి కష్ట సుఖాలు, ప్రేమ కాలాపాలు, పొలం పనులు, శ్రమైక జీవనం, దూర ప్రయాణాలు, దారి

దోపిళ్లు వగైరా. జనుల దారిద్ర్యం, "రెడ్ల" దౌర్జన్యం, వేశ్యల కౌలట్యం, మాత్రమే కాక, భార్యా భర్తల అను రాగాలు, త్యాగశీలత, కుటుంబ శ్రేయస్సు వంటి ఉత్కృష్ట లక్షణాలు కూడా యిందులో వర్ణింపబడ్డాయి.

## శృంగార రసం

సూరుడనే కవి శృంగార రసాన్నెంత చక్కగా పోషించాడో చూద్దాం. ఫాల్గుణోత్సవం నాడు సరసు లొకరి మీద ఒకరు పేడనీళ్ళు చల్లుకోవడం సంప్రదాయం. అలా ఒక సరసు డొక సొగసు గత్తెమీద పేడ చల్లేడట.

ఒప్పునిది ఫాల్గుణోత్సంబున నంచు
జల్లె గలప మెవడొ సరసు డింతి
కరిగిపోయె జన్నుగడపల బొరలు-
చెమ్మటల నదియు ; నేల
మరల గడుగ?

(పుట 72 ; 1 : 290)

కాంత ఘరుడను యింకో కవి మదనోత్సవాన్ని వర్ణిస్తూ వ్రాసిన గాథ:

వడకుచును గంద వొడి తన
పిడికిట గొని చల్లుకొరకు ప్రియు
జేరంగ బో
యెడు ముగుదకు జెమ్మట న
ప్పుడ కలంబయ్యె హస్తమున నది
యెల్లన్.

(పుట 62 ; 1 : 244)

ఎప్పుడైనా, ఎక్కడైనా కీడు సంభవిస్తే, ప్రియుడు పటంలో చిత్రంలాగ పెడమొగం పెట్టకుండా, ఆదుకొనే వాడైయుండాలి. చేస్తే అట్టివానితోనే చెలిమి చేయాలంటుంది, ఒక ప్రియురాలు. (పుట 44; 1: 171)

ఒక ప్రియుడు రాత్రి పూట చూచిన భార్యనే పగటి పూట కూడా చూస్తాడు. కాని, అతని కళ్ళకు ఆమె ఇద్దరిలా కనిపిస్తుంది. మయరందుడనే కవి యీ చోద్యాన్నిలా వివరిస్తాడు.

చేరి సంతసమున జెక్కిళ్లు పొంగంగ
నాజ్ఞలిచ్చు రాత్రులందు నాకు
పగలు వంచియున్న మొగము
నెత్తదు ; చెలి
యదె యిదంచు నమ్మ టరిది చూడ.

(పుట 5; 1 : 18)

మరో కవి, వంటింట్లో పొయ్యిఊదే భార్య సౌందర్యానికి భర్త ఎలా ముగ్ధుడవుతాడో వర్ణిస్తాడు:

ఎర్రబారు కనులు నెగబోత కసియూదు
వీగు జన్నుగవయు వెడలు బాష్ప-
ములును గలిగి నీవు ప్రొయ్యూదు పని
యిట్లె
మగువ సొగు గాక, ముగియకుండ.

(పుట 130 ; II : 17)

భర్తమీద అలిగిన భార్యకూ, ఆమెను అనునయించే భర్తకూ మధ్య సంభాషణను కువిందుడిలా వర్ణిస్తాడు:

"అలుకమాను చెలియ!" "అలిగిన
దెవ్వతె?"
"మెలత నీవె!" "యొరుల మీద నాకు
నేటి యలుక?" "యిచట నెవ్వరొరులు?"
"నాథ
నీవె!" "యెట్లు?" "నాయదృష్ట
మహిమ!"

(పుట 76; 1 : 304)

తన ప్రియుడింకొకతెతో సాంగత్యమొనర్చి నప్పుడు ప్రియురాలికి కలిగే ఈర్ష్య పొలయలుక అని రసిక పరిభాష. దానిని కలిగించి ఆనందించుట రసికుల స్వభావం. అందుకు వ్యతిరేకంగా, అది వారికి కోపం కలిగిస్తే, అందమే చెడుతుంది. తాను పైవేసు

కొన్న పొలయలుకను ప్రియుడు తెలుసు కొన లేనందుకు ప్రేయసి అతనిని "లేకివాడ" అని సంబోధిస్తుంది. తమ కాముక వృత్తికి అది అడ్డు రాబని లేదంటుంది. దీన్నే మియంగు డిలా వర్ణించాడు :

ఊరకేల నన్ను నోదార్చెదవు కౌగి
లించుకొనుము; కినుక లేదు నాకు ;
నీకు నల్క దెచ్చునేని యా పొలయల్క-
నాకు బూననేల లేకివాడ !

(పుట 37; 1: 146)

ఒక కవి స్వర్గమంటే ఏమిటో నిర్వచించాడు. అతని పలుకులు బార్వాకుని పలుకుల్ని జ్ఞప్తికి తెస్తాయి. అతడేమంటున్నాడో చూడండి :

జవ్వనంపు బెంపు, సంపద, జాణల
తోడి చెలిమి, వలపు దొలకు దయిత,
నవ వసంతవేళ – యివియపో స్వర్గము !
వట్టి కథలు తక్కినట్టి వెల్ల!

(పుట 176; IV ; 28)

మరో కవి అన్న మాటలు :

పెడచదువు లెన్నొ చదివెదు; పెద్ద ధర్మ
వేత్తవుర, చేదు మేసెడు వేప పుర్వు
సాటి వాడవు! మన కొక్కసారె నరక –
మిద్దరకు వచ్చునేని రానీర; ఘోర!

(పుట 156; III : 50)

## సమష్టి కుటుంబం

ఆ రోజుల్లో సమష్టి కుటుంబం కొన్ని కట్టుబాట్ల మధ్య భార్యా భర్తల్ని, తల్లి తండ్రుల్ని, కొడుకు కోడళ్లనీ ఐక్య మొనర్చి, ఎవరి విధుల్ని వారు నెర వేర్చేటట్టు జాగ్రత్తలు తీసుకొనేది. భార్యా భర్తల మధ్య అన్యోన్యత, తల్లి దండ్రుల పట్ల భక్తి, అత్తమామల పట్ల గౌరవం వృద్ధిచెందేలా చూచేది. అయినా, కుటుంబ సభ్యులందరూ మూస పోసినట్లు ఒకే మోస్తరుగా మెలగేవారు కారు.

భార్య తన యింటి కలిమి లేముల్ని తెలుసుకొని మరీ ప్రవర్తించాలని హెచ్చరించాడు, బహుబాలుడు. అతని మాటలు యివి :

కలిమి లేమయను సుఖంబు దుఃఖంబును
దెలిసి నడచి యిల్లు దీర్పనేర్చు –
వారె సతులు లాతి వారలు మగలకు
నంటి యుండు ముప్పాలంతె కొడుక !

(పుట 96 ; 1 : 386)

కుమారిలుడు మంచి యిల్లాండ్ర లక్షణాలనిలా వర్ణించాడు :

అలతి సగవులె చీవాట్లు ; హద్దు మీరి
సలువు నుపచారములె మదిగలచు పనులు ;
కంట దడివెట్టుకొనుటె కలహ విధము
అరయనిట్టిది మంచి ఇల్లాండ్ర నడత.

(పుట 101; 1 : 406)

పతివ్రత సౌందర్యవతి అయినా, భర్త ఊరలేకున్నా, పేదరికంలో తాను మునిగి తేలుతున్నా, యిల్లు పెద్ద వీధిలో ఉన్నా, వయసు పరువమైనదైనా, పొరుగింట రంకులాడి ఉన్నా సత్ప్రవర్తనను వీడదంటాడు, మహిలుడు. (పుట 7 ; 1 : 27)

కాళ్లు కడుక్కొని, మడిగట్టుకొని సంధ్యావందనం చేసుకొని, ఆ తర్వాత భోజనం చేయడం భర్తకు అలవాటు. తర్వాత అతడు బయటికి వెళ్లడం అరుదు. బయటికి సాయంత్రం కాక ముందే వెళ్లి రాత్రి మరెక్కడైనా గడిపి

రావడం పరిపాటి. అలా జరుగకూడదని భార్య తలంపు. అందుచేత ఆమె సాయంత్రం పడకుండా భర్త కాళ్ళు కడగబోతుంది. అతడది గ్రహించి నవ్వుతాడు. అతడు గ్రహించాడని తెలుసుకొని, ఆమె కూడ నవ్వుతుంది.

(పుట 25 ; 1 : 100)

సహగమనాలు కూడ ఆ రోజుల్లో ఉండేవని ఒకగాథ తెలుపుతుంది.

(పుట 155; III : 45

పలువురు కవులు పాతివ్రత్యాన్ని కొనియాడుతూ అనేక గాథలు వ్రాసినా, ఆ పాతివ్రత్యం వెనుకనున్న స్త్రీ నిస్సహాయతను బయట పెట్టే గాథ ఒకటి మాత్రమే ఉంది. దాన్ని రచించినదెవరో తెలియదు. అది యిలా ఉంది.

మోసమున దోచు; బలవంతముననుగలుగు ;
వట్టి డబ్బు పేరాస జూపట్టు; మరియు
యిట్టు మొగమాటముననను భువిని – బ్రేమ;
దండములు దండములు సుమ్మ దానికెల్ల!

(పుట 132; II : 23)

భార్యల పట్ల విపరీతానురక్తి గల భర్తలు కూడా ఆనాడుండే వారు. పుండరీయుడనే కవి యిలా వ్రాశాడు:

ప్రీతి పాత్రమైన పెండ్లాము సచ్చిన
యింటి పాడు సూచి యేడ్వలేక,
చనడు పొలము విడిచి పనిలేక యున్నను
పామరుండు చూడు పల్లె కాపు!

(పుట 33 ; 1 : 131)

ఇలాగే, కొడుకు దూర దేశాల్లో ఉన్నప్పుడు చిక్కి శల్యమైన కోడల్ని చూచి కంట తడిపెట్టే అత్తలు కూడ ఉండవారు. పదగ్గుడు అన కవి ఒక సన్నివేశాన్ని యిలా వర్ణించాడు.

ఊరగ నొడుకులేక యుండగా గోడలు
వచ్చి కాళ్ళు మ్రొక్కి వంగినప్పుడు
గాజులెల్ల జారగా జూచి కడు గోపక
త్తెయయ్యె నేడ్చె నత్తగారు.

(పుట 93; 1 : 372)

రెండోవైపు, భర్తలకు తెలియకుండా విటుల్ని చేరే భార్యలు కూడా ఎందరో ఉండేవారు. ఉదా:

అత్త పడినదింట మత్తెక్కి; పతి యెందో
పోయినాడు; గుక్కపోతు సచ్చె;
బత్తిచేను విరుగబడ మేసె నెను బోతు;
దీనినతని కెవరు తెలుపువారు?

(పుట 102; 1 : 412)

ఊరలేడు మగడు ; కారుచీకటి గ్రమ్మె
నట్టి పాడురేయి ; వట్టి యిల్లు,
దొంగ లెవ్వరైన దోతురు సుమ్ము ; ని –
ద్రింపవలదు ప్రక్కయింటి వాడ!

(పుట 66 ; I : 263)

"ఇంట నేనొంటరిగా ఉన్నాను. నీవు రావచ్చు; పత్తి చేను కడకు వెళ్లవద్దు" అను ధ్వనిని పొంచి వింటున్న విటునికి కలిగించుటకై చెప్పినది మొదటిపద్యం. రెండవ పద్యభావం, ప్రక్క యింటి విటునితో భయాన్ని నటిస్తూ అతనికి నిద్రించ వద్దని చెప్పడం.

కోడలు రాత్రి యిల్లు విడిచి చరించకుండా అత్త కాపలా కాయడం మరొక గాథలో పేర్కొన బడింది:

క్రొత్త మొగిలి సూచి కోడలి ప్రాణముల్

కదలుచుండ దాని గాచుచున్న -
దితర చింత విడిచి సుమపాలి సంజీవ
నౌషధమ్ము బోలె నత్తగారు
(పుట 66; I : 264)

## వర్గ వైరుధ్యాల ప్రభావం

శాతవాహనుల కాలంలో వ్యవసాయం, పరిశ్రమలు, వ్యాపారం ఉవ్వేత్తుగా విజృంభించాయి. ముఖ్యంగా విదేశ వ్యాపారం ఊహించనలవి కానంతగా వృద్ధిచెందింది. ఇలా అభివృద్ధిచెందిన సంపద సహజంగా వర్గవైరుధ్యాలను ప్రకోపింప జేసింది. దాని ఫలితంగా, స్వార్థం పెచ్చు పెరిగింది. కాఠిన్యం వృద్ధిచెందింది. రెండో వైపు వైరాగ్యం, పరలోక చింతన ఎక్కువయాయి. చక్రవర్తి హాలుడే ఒక గాథలో యీ పరిణామాన్ని యిలా పేర్కొన్నాడు:

చనిన యౌవనంబు వెనుకకు రాదు; జీ-
వంబు చూడ శాశ్వతంబె కాదు ;
ఒక్కనాడు వోలె నొక్క నాడుండదు ;
జనుల కింత కటిక తన మదేల?
(పుట 51; I : 198)

మరొక కవి యిలా వ్రాశాడు.

విసమగు గొందరకు ; నమృత
రసమగు గొందరకు ; గొందరకు నమృతంబున్
విసమునగు : గొందరకు మరి
విసమును నమృతమును గాక వెడలును బ్రతుకుల్.
(పుట 173; IV : 19)

ఇంకొక కవి మాటలు:

నియతి గరిత యెపుడు నిలువక పయనంబు
వోవుచుండు కాలపూరుషునకు
జద్దిగట్టి యిచ్చు సమయంబునకు గొర
గాని యురువు లెందుగాని లేవు.
(పుట 174 ; IV : 21)

అనగా, విధి ఎల్లప్పుడూ పయనిస్తూనే ఉంటుంది. కాలం నిలువదు. అది వచ్చినప్పుడు తలవ్రాత ప్రకారం పిన్న, పెద్ద అనే వివక్షతలేక అందరూ దానికి ఆహారం అవుతారు.

ఈ లోకంలో మంచివాళ్ళే కనిపించడం లేదంటూ కుమారుడను కవి విలపిస్తాడు. అతని మాటలు:

మంచివారు గానిపించుటే యరిది యీ
పొడు జగమునందు ఐలువ గుంపు
నిండియుంట ; గాకి తండంబు లున్నంత
యంచ లుండగలవె యవని మీద?
(పుట 80; I : 319)

ఇట్టి పరిస్థితుల్లో, ఎవరూ నిరాశ చెందరాదనీ, నవ్వుతూ కాలం గడపమనీ ఒక కవి పాఠకులకు చెబుతాడు. అతడిలా అంటాడు:

నవ్వవోయి యొరులు నవ్వనియట్లు ; భా-
షించవోయి యొరుల కించునట్లు ;
బ్రదుకవోయి కీర్తి పొదలు నటులు ; తుద
గిట్టవోయి మరల బుట్టనట్లు.
(పుట 144; III : 3)

పరిస్థితుల్ని చక్కబరచు కొనేందుకు పోరుసల్పమని ప్రబోధించక పోయినా ఎప్పటికైనా చక్కబడి తీరుతాయి అనే ఆశాభావం పై పంక్తుల్లో ద్యోతకమవుతుంది.

(సశేషం)

# వలయం

కథానిక

టి. ప్రసన్నకుమార్

నరేంద్రకు కొడుకు పుట్టాడు. అసలు తన భార్య కడుపుతో వున్న దగ్గర్నుంచి అందరికీ కొడుకే పుడతాడని చెపుతూ వచ్చాడు. కొంతమందితో పందెం కాసాడు కూడా! ఎవరయినా "ఆడపిల్ల పుడితే, ఏం చేస్తావోయ్" అంటే, కాసేపు ఉడుక్కుని తనకు మగపిల్లాడే ఎందుకు పుడతాడో వివరించే వాడు. అటు మామగారి వైపు తన భార్య తప్ప వేరే ఆడపిల్లలు లేరట, ఇటు తన వైపు వాళ్ళమ్మకు వరసగా అయిదుగురూ మగపిల్లలేనట, తన అన్నలందరికీ తొలి చూలు కొడుకులేనట. "మరి నాకు మాత్రం ఆడపిల్ల ఎలా పుడుతుందండి" అని ఎదురు అడిగే వాడు. అలా ముందునుంచి అనుకున్నట్టు మగపిల్లాడు పుట్టటంతో అతనికి ఆనందం రెట్టింపయ్యింది. ఆ జోరులో ఆఫీసులో అందరికీ మందు పార్టీ ప్రోమిస్ చేసాడు. దాంతో కొలీగ్స్ కూడా సంతోషించారు అతనికి కొడుకే పుట్టినందుకు!

నరేంద్రకు రెక్కలుగట్టుకుని కొడుకు దగ్గర వాలాలనిపించింది. అయితే అందుకు అంతరాయం కలిగిస్తూ మామగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది – పిల్లాడు పుట్టిన నక్షత్రం ప్రకారం తండ్రి వెంటనే చూసేందుకు వీలు లేదనీ, పదకొండో రోజు 'శాంతి', 'శుద్ధిపుణ్యాచనం' అవీ అయేంత వరకూ ఆగాలనీ. వెధవాచారాలూ వీళ్ళునూ అని కాస్సేపు తిట్టుకున్నాడు. ఎప్పుడు లీవు పెట్టి రమ్మని వ్రాసారో చూసుకుని శెలవు చీటి వ్రాసి పంపించాడు.

మామగారి ఊరొచ్చాడు నరేంద్ర. పిల్లాడన్నయితే ఏదో తతంగం అదీ అయేంత వరకూ ఎలాగూ చూపించరు. పెళ్ళాన్నయినా చూసి తనివితీరా కబుర్లు చెబుదామనుకున్నాడు. కానీ పిల్లాడి దగ్గరే ఆ అమ్మాయి వుండడంవల్ల కుదిరింది కాదు. వుసూరుమంది ప్రాణం. గత్యంతరం లేక మామగారితో మాటలు మొదలు పెట్టాడు.

"అమ్మగారు రానే లేదు." నిష్ఠూరంతో ప్రారంభించాడు మామగారు. "అబ్బే వద్దామనే అనుకుంది కానీ ప్రయాణం కష్టం అని మానుకుంది. ఈ మధ్య తన ఆరోగ్యం అంతగా బావుంటం లేదు కూడా. ఎలాగూ మూడో నెల్లో రానే వస్తాడు కదా మనవడు అని ఊరుకుంది" అంటూ సర్దిచెప్పాడు నరేంద్ర. "మనవడి కోసం ఆ మాత్రం కష్టపడకపోతే ఎలా? మాకు మాత్రం ఓపికలున్నాయా?" సాగదీసాడు మామగారు.

"ఇంతకీ బారసాల ఎక్కడ చేస్తున్నారు. మన ఇల్లు చిన్నది కదా. భోజనాలూ అవీ కుదరుతయా?" అంటూ మాట మార్చేసాడు.

"అన్నట్టు చెప్పనే లేదు కదూ మీకు? ఈ మధ్య మనవాళ్ళం అంతా కలిసి సత్రం కట్టించాం ఇక్కడ. బాగా పెద్దదే. మీ మద్రాసు చవుల్ట్రీ లంత ఉంటుంది. దాంట్లోనే ఒక ప్రక్కగా అమ్మవారి గుడీ, వెనకవైపు గొడౌన్లు ఉన్నాయి. ఇప్పటిదాకా నాలుగు లక్షలయింది.

ఇంకా కొన్ని గొడౌన్లు పూర్తి కానే లేదు'' అంటూ గర్వంగా చెప్పాడు. "వ్వాట్? నాలుగు లక్షలయిందా'' ఆశ్చర్యపోయాడు నరేంద్ర. "ఆ మిగతా గొడౌన్లు పూర్తయ్యేసరికి అయిదు లక్షలూ పూర్తవుతుందనుకుంటా.''

యాభైవేలైనా లేని ఊళ్లో అయిదు లక్షలు పెట్టి సత్రమా అని ఆశ్చర్యపోయాడు నరేంద్ర. అదే మాట పైకి అన్నాడు. వాళ్ళ మామ గారు నొచ్చుకుని "అదేమిటల్లుడు గారూ అలాగంటారు? మొన్నకి మొన్న మీ పెళ్ళికి ఎంత కష్టం అయ్యింది మాకు. ఒకరింట్లో విడిది. ఒకరింట్లో భోజనాలు. మా ఇంట్లో పెళ్ళి. పిల్లి తిరిగినట్లు తిరిగాం కదా ఇల్లిల్లూ. అందరిళ్ళల్లోనూ అదే కష్టం. అందరు పూనుకొని ఈ సత్రం కట్టించాం. ఇప్పుడెంత హాయి ప్రాణానికి'' అంటూ సత్రం ఎంతవసరమో ఇంకా కొంచంసేపు ఏకరవు పెట్టాడు. ఆయనతో వాదించటం ఎందుకని మౌనంగా ఉండి పోయాడు నరేంద్ర.

ఆ రోజే ప్రొద్దున శుద్ధి పుణ్యాచనం. బారసాల. సాయంత్రం రాత్రి అమ్మవారి పూజ. అన్నీ కొత్తగా కట్టిన సత్రంలోనే ఏర్పాటు చేసారు. సత్రమంతా హడావుడిగా ఉంది. చిన్న ఊరేమో, పిల్చిన ఇళ్లల్లో మొత్తం అంత మందీ వచ్చారు, వెళ్ళకపోతే బావుండదని. ఎవరయినా రాకపోతే మళ్ళీకబురు పంపిస్తున్నారు, భోజనానికయినా తప్పక రమ్మని. దాదాపు పెళ్ళికి జరిగే హడావిడి జరుగుతోంది. పిల్లవాడి సారె అంటూ బంగారువి గొలుసు,, మొలతాడు, మురుగులు, కడియాలు, ఉంగరం ఇచ్చారు. వెండివి ఉగ్గు గిన్నె, పాల చెంబు, పౌడరు డబ్బా, చిన్న కంచం, ఇంకా దుప్పట్లు, తువ్వాళ్ళు, దిండ్లు, సోపులు, చిన్న పక్క, ఉయ్యాల గుడ్డలూ చాలానే చదివించారు నరేంద్ర మామ గారు.

మాములుగా "అక్కర్లేని ఆచారాలు, ఆడంబరాలున్నూ. డబ్బు దండక్కితప్ప ఎందుకూ పనికి రావు'' అనేవాడు, నరేంద్ర ఇలాటివి చూసినప్పుడు. కానీ ఇప్పుడు మామగారిచ్చిన సామాను చూస్తుంటే తెలియకుండానీ అతని పెదవుల మీదకు చిరునవ్వు వచ్చింది. అందులో గర్వం తృప్తి రెండూ ఉన్నాయి. తన్మయంగా చూసుకుంటున్నాడు సారెను.

"ఇంత మందికి ఎడుతుండావ్ మాకో ముద్ద తక్కువ్వద్దా సామి ముష్టోల్లం, ఇంత పడెయ్యి బాబు. మీ పిల్లా పాప చల్లగుండాల'' – ఎవరో ముష్టి వాళ్ళు సత్రం బయట నుంచి అరుస్తున్నారు. వాళ్ళను పొమ్మంటూ నరేంద్ర మామ గారు గట్టిగా అరుస్తున్నారు. వాళ్ళు పోకుండా లోపల విస్తళ్ళల్లో జరిగే వడ్డన వైపు ఆశగా చూస్తూ బతిమిలాడుతున్నారు. పొమ్మంటే మీక్కాదూ. "ఎందుకలా నిల్చుంటారు దిష్టి బొమ్మల్లా. పొండి పొండి'' కసురుకొన్నాడు.

"తలోముద్దా ఎయ్యి బాబయ్యా పోతం.''

"ఏమిటింత జబర్దస్తీగా అడుగుతున్నారు. మీ అబ్బ సొమ్మేమన్నా దాచారా ఏం. తలో ముద్దా వెయ్యాలంట. ఇలా అడిగి నోళ్ళందరకూ పెడుతూ ఉంటే అయినట్టే, పోండి పోండి.'' విసుక్కున్నాడు నరేంద్ర మామ గారు.

" అబ్బ సొమ్మేంది. మా సొమ్మే

దాచాం. మాలాటోళ్ల ఎంత మంది నోళ్ళు కొట్టందే కూడబెట్టావ్ ఇంత ముద నట్టం?'' కడుపు మండిందొకడికి.

ఆ మాటకు వళ్ళు తెలియని కోపం వచ్చింది నరేంద్ర మామ గారికి. వాణ్ని నానా మాటలూ అని, కర్ర తీసుకొని బాదాడు. మిగతా ముష్టోళ్ళు ప్రక్కకు తప్పుకుని చూస్తూ నిలబడ్డారే గానీఆయన్ని ఆపేసాహసం చెయ్యలేదు.

''ఛీ ఛీ ముష్టి వెధవలూ, ముష్టిమా లోకం. నీతా జాతా ముండాకొడుకులికి? అలా కుళ్ళి చస్తారు కాబట్టే అడుక్కు తింటున్నారు.'' తిట్టుకుంటూ లోపలకు వెళ్ళి పోయారు అంతవరకూ చోద్యం చూసిన వాళ్ళంతా

ఆ రాత్రి గుళ్ళో పూజకు హడావుడి పడ్తోంది నరేంద్ర అత్త గారు. ఆవిడ నూటొక్క కొబ్బరి కాయలు కొడతానని మొక్కుకుందట కాన్పు కష్టం అయితే. అవింకా రాలేదని భర్తమీద విసుక్కుం టోంది. ''పీకల మీద కొచ్చేదాకా ఏ పనీ చెయ్య''రంటూ. గుమాస్తా వచ్చి చెప్పాడు. కొబ్బరికాయలు తీస్తా ఉంటే కొన్ని క్రింద పడి దొర్లి పోయాయంట. వాటిని దొరక పుచ్చుకుని ఇద్దరు ముష్టోళ్ళుపరుగెత్తుకుని వెళ్ళిపోయారట. అలా కొరత బడ్డ కాయల్ని తిరిగి తీసు కొచ్చేసరికి ఆలస్యం అయిందట.

ఇదంతా విన్న వాళ్ళు ''అలా దొంగ బుద్దుల్తో చస్తారు కాబట్టే అలాగున్నారు. దేవుడి సొమ్ము దొంగిలిస్తే బాగు పడతారా ఈలాంటోళ్ళు? ఇంకా పది జన్మ లెత్తినా అడుక్కు తింటూనే వుంటారు.'' అని మరోసారి తిట్లు.

అంతా సుష్టుగా భోంచేసి మంచాల మీద కూర్చున్నారు, భుక్తాయాసంతో. వాళ్ళతో వీళ్ళతో కాసేపు కబుర్లాడి తన గదిలోకి వెళ్ళి పోయాడు నరేంద్ర. పడక కుర్చీలో కూర్చొని అబ్బాయి పేరుతో ఎన్ని వేలకు ఇన్స్యూర్ చెయ్యాలా అని ఆలోచిస్తున్నాడు. కొడుకు అప్పుడే పెరిగిపోయి పెద్ద డాక్టరై పోయినట్లు, పెద్ద పెద్ద కార్లల్లో తిరుగుతున్నట్లు కలలు కంటున్నాడు.

''బావా . . . బావా''. ఎవరో చిన్న పిల్ల అతని వేలు పట్టి కదుపుతూంటే లోకంలోకి వచ్చాడు.

''నువ్వా రాణీ! ఏం ఇలా వచ్చావ్'' అంటూ పలకరించాడు. ''బావా నీకు తెలుగు చదవటం వ్రాయటం వచ్చా?'' కళ్ళు గుండ్రంగా తిప్పుతూ అడిగింది.

నవ్వొచ్చింది నరేంద్రకు. మద్రాసు వాళ్లంటే వాళ్ళ కసలు తెలుగురాదను కుంటారు చాలామంది. బహుశా ఈ పిల్లకూడా అలాగే అనుకుని వుండొచ్చు.

''ఎందుకు రాదూ? వచ్చమ్మా'' అన్నాడు.

''అయితే ఇది చదువు చూద్దాం.'' పక్కనే ఉన్న తెలుగు పత్రికలో ఒక పేజీ తీసి ఒకచోట వేలుపెట్టి, ఒకవాక్యం చూపించింది. చదివాడు. ''మతమూ - దరిద్రమూ ఒకే నాణానికి వున్న రెండు వైపులు లాంటివి. ఒకటి పోతే రెండోది దానంతటదే పోతుంది. శ్రీశ్రీ.''

ఎవరో వీపుమీద చళ్ళున చరిచి నట్ల యింది. ఉలిక్కి పడ్డాడు నరేంద్ర. అతని కళ్లముందు, లక్షలు పెట్టికట్టిన సత్రమూ, మామ గారు పెట్టిన సారె, కొబ్బరి కాయలు, భార్య వేసుకొన్న నగలూ ఒకటి తరువాత ఒకటి గిర్రున తిరిగాయి వలయంలా. దెబ్బలు తిన్న ముష్టివాడు దూరంగా నిలబడి ఆ వల యం వైపు కాసేపు దీనంగా, కాసేపు కోపంగా చూస్తున్నట్టనిపించింది!

# రచయితలకు గోర్కీ బోధలు

## రచయిత ఎలా వుండాలి ?

మనస్సులోనూ, బయటనూ మనిషిని పట్టుకు పీడించే ప్రతి దానినీ, మనుష్యుని పురోగతినీ, శక్తి సామర్థ్యాల పెరుగుదలనూ ఆటంక పరిచే ప్రతిదానినీ రచయిత అసహ్యించు కొని ఎదుర్కోవాలి. సోమరులంటే, ఇతరుల మీద బతికేసే వాళ్లంటే, నీచులు, చేతులు నలిపే వాళ్లంటేనూ, అన్నిరకాల, తరహాల దుర్మార్గు లంటేనూ, పరమాసహ్యం చూపాలి.

సృజనాత్మక శక్తికి మూలంగా, సర్వవస్తు నిర్మాతగా, ఈ భూమి మీద అద్భుతాలు సృష్టిస్తున్న వానిగా మానవుణ్ణి రచయిత మన్నించాలి. అనవసరమైన శరీర శ్రమ పడ నక్కర్లేకుండా స్వశక్తితో, తన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంతో ప్రాకృతిక భౌతిక శక్తుల్ని ప్రతి ఘటించి, నూతన ప్రతి సృష్టిచేసే వానిగా గౌరవించాలి.

స్త్రీని కేవలం శారీరకానందదాయి నిగా కాకుండా, కష్టతరమైన జీవన వ్యాపారంలో నిజమైన సహచరు రాలిగా రచయిత పరిగణించాలి. మనం చేసే ప్రతి పనికి మనం పిల్లల ముందు బాధ్యులం అన్నట్లు వ్యవహ రించాలి.

పాఠకులు జీవితంలో ఎక్కువ క్రియాశీల పాత్ర వహించేటట్లు రచయిత సర్వవిధాలా ప్రోత్సహిం చాలి. స్వశక్తిపట్ల వారిలో అధికంగా విశ్వాసం రేకెత్తించాలి. జీవిత మహదర్థాన్ని అర్థంచేసుకోలేకుండా, పని చెయ్యడం లోని ఆనందానికున్న అపార ప్రాముఖ్యం తెలియకుండా ఆటంక పరుస్తున్న ప్రతి అపరోధాన్ని - అది మానసికమైనదైనా, బాహిరమైనదైనా- అధిగమించ గలమనే విశ్వాసాన్ని వారిలో కలిగించాలి.

శ్రామిక ప్రపంచానికి కావలసిన రచయిత గురించి నా అభిప్రాయం ఇది.

## దుష్టత్వం మనిషికి సహజం కాదు

మనిషి సహజంగా దుష్టుడు కాడన్ని, రచయితకు విధిగా తెలిసివుండాలి, గుర్తించు కోవాలి. వర్గ సమాజం లోని భయానక వ్యవస్థ అతనిని పాడు చేస్తూంది. ఆ సమాజం ప్రజల్ని పీడించ కుండా, వారిలో అసూయ, దురాశ, ద్వేషం, సోమరితనం కలిగించకుండా వుండలేదు. సులభ లాభ సంపాదనకు ప్రయత్నించకుండా, చౌకబారు నిరర్థక సరదాల కోసం, స్వేచ్ఛాచారానికి, తాగుబోతునాతనికి, అన్ని తరహాల పాడు పనులకోసం తాపత్రయ పడ కుండా వుండనివ్వదు.

మనిషికి పుట్టుకతోనే ఈ నీచమైన పాడు లక్షణాలు వుంటాయని, అవి అతనిలోని జంతు ప్రవృత్తిలో గర్భితమై వున్నాయని చెప్పడం కొందరికి లాభమూ, అవసరమూను. ఆ విష యాన్ని యువకులు గమ నించి గుర్తుంచు కోవాలి. మనుష్యుని చుట్టూ గిరి

గేసేందుకు, ఉత్తమ జీవితాన్ని, పని స్వాతంత్ర్యాన్ని సృజనానందాన్ని సాధించాలనే వాంఛను నాశనం చేయాలనే భావం ఈ బోధనలో గర్భితంగా వుంది. దోపిడీవర్గ రాజ్యానికి, సమాజానికి బానిసను చేయాలనే కోరిక దానిలో వుంది. ఈ బోధన మనిషిని వట్టి ముడి సరుకుగా భావిస్తుంది.

ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించే వారంతా వట్టి దుష్టులు; న్యాయమైన, క్రియాశీల శ్రమ జీవితానికి వీరు పనికిరారు. శ్రామిక ప్రజల్ని అసహ్యించుకొని, నీచపరచే విధంగా తప్ప మరో విధమైన జీవితం వీరి వూహలకి కూడా అందదు. ఆఫ్రికాలోని నీగ్రో తెగలు, సైబీరియా లోని యాకూత్, బూర్యాత్, తుంగుస్ మొదలైన వారు చాలా దయాపరులని మానుష శాస్త్రవేత్తలు నిరూపించేరు. ఆటవికులని మనం పిలిచే ఈ తెగలు, దుష్టబుద్ధులు జన్మసహజ మన్న వాదాన్ని వమ్ము చేస్తున్నాయి.

మీరు నిజాయతీగా బ్రతకాలనుకుంటే, విప్లవకారులు అయితీరాలి.

## ముురికి పిల్ల, . . . . గులాం గౌస్

రేపెలాగూ నగ్నం చేస్తామని
ఆ పిల్ల ఒంటి మీద
ఇవ్వాళే బట్టల్లేకుండా చేశారు.
అలా జైల్లో శిలలా దొర్లుకుంటూ
బ్రతకమని
సామాజికంగా శాసించారు.
ఆ పిల్ల ఒంటి మీద ఆకలి తప్ప,
సిగ్గులేదు.
ఆ పిల్ల వీధుల్లోంచి, వీధుల్లోకి
నగ్న శిలావిగ్రహంలా
అలా తిరుగుతూనే వుంటుంది.
దేవాలయపు అరుగుల మీదే నిద్రిస్తుంది
అయినా దేవుడ్ని నమ్మదు.
ఎండమావుల కేసి తీవ్రంగా చూస్తుంది
అయినా నీటి బావులని భ్రమించదు.
కళ్ళను మేకుల్లా దింపుకుందేమొ ?
జీవితం మురికి కాగితంలా వ్రేలాడ్తోంది.
సూర్యుడంటే ఆసక్తి లేదు.
చీకటి అద్దం ముందు
దీపంలా సింగారించు కోదు.
మురికి కాల్వల్లో తెప్పలా
చెత్తకుండీలో మచ్చలా
కనిపించే మాడు చెక్కే,
ఆ పిల్లకు ఉషస్సు,
ఆ పిల్లకు నవ్వురాదు
ఆ పిల్ల నవ్వే అందరూ నవ్వుతున్నారు.
ఆ పిల్ల కసలు కన్నీళ్ళు రావు
కొన్ని తరాల కన్నీటిని
తల్లే కార్చి పోయింది -
తాను పుడుతూ,
తన తల్లి ఆకలి తీర్చి వచ్చిందా పిల్ల.
కోసినా, మేసినా
గొంతు విప్ప లేని
గరిక పోచల దేశానిదా పిల్ల.

అంతర్జాతీయత పాటించాలంటే చాలదు. గడ్డు పరిస్థితి ఏర్పడినప్పుడు కూడా క్రియా రూపంలో అంతర్జాతీయవాదిగా వుండాలి. (లెనిన్)

నీచుడు నీచుడే, నిజయితీ పరుడు నిజాయితీ పరుడే, తమ పంథాయే సరియైనదని రుజువు చేసుకునేందుకు యిద్దరికీ మతవాదాలకు, నీతి వాదాలకూ లోపం వుండదు. (బెర్నార్డ్ షా)

# ఆముదపు చెట్లు

మిరియాల రామకృష్ణ

[సంగీతంలో తుఫాను సృష్టించేవాళ్ళూ తుఫానులో సంగీతం తీసేవాళ్ళూ అభినయంతో వైద్యం చేసేవాళ్లూ వైద్యంతో మేడలు కట్టేవాళ్లూ అర్ధరాత్రి అన్నం తినేవాళ్లూ అన్నంలో ఉమ్మేసేవాళ్ళూ గుండెల్లో రాళ్లున్నవాళ్ళూ రాళ్లలో గుర్రు పెట్టేవాళ్ళూ వెన్నులేని విద్యార్థులు వెన్నులేని నాయకులూ నవ్వులేని నాతులూ పువ్వులేని తీగలూ ఈ కవిత వినకూడదు.]

వీడు — సంగీత మధుమాసం నడుస్తూ
ఉండగా వికటఘోర జిలో
పకపకా నవ్వుతూ ఉన్మాదా
షాఢంలోకి పంచాంగాన్నే
మార్చేస్తాడు ! వటవృక్షాల్నే
పెల్లగిస్తూ సాగరాల్నే దౌడు
తీయిస్తూ జటిల ఝంఝూ
నిలాల్ని కల్పిస్తాడు !

వాడు — విశ్వంభర అంతా తుఫానులో
విలవిల్లాడుతూ ఉండగా
విచిత్ర సురభిళ విలసిత రాగా
లను గండూషిస్తూ ఆనంద
మందార వనంలో ఒక్కడూ
పట్టాభిషేకం జరుపు
కుంటాడు !

వీడు — వచోవిలాసాల్ని అనుపా
నాలుగా వాడుతూ ఔషధాల
కోసం ఖానీ ఖర్చు చేయ
కుండానే వైద్యం చేస్తున్నట్లు
నటిస్తూ రోగిని నరకంలోకి
మెడపట్టుకు గెంటుతాడు !

వాడు — రోగరాక్షసిని మర్దించడానికి
ఏ సూదులూ కత్తులూ తీయ
కుండానే తెల్లకాగితం మీద
(అది కూడా మరొకరు సప్లయి
చేసిందే) ఆరోగ్య కేతనాలు
నాటుతూ ధనంజయుడై
శంపాలతల్ని చుంబించే -
శరత్పూర్ణిమల్ని ఆహ్వానించే
మేడలు కట్టిస్తూ ఉంటాడు!

వీడు — వ్యవహారాల్లో వాహ్యాళి
చేస్తూ కారులో పల్లవతల్పాల
మీద విరహ వికారాలు వెల్ల
డిస్తూ పాత్రల్లో శశివదనల్ని
పలకరిస్తూ ఆశయాల్ని
హత్యచేసిన హస్తాలు ఆర
కుండానే అర్ధరాత్రి భోం
చేస్తాడు!

వాడు — తబ్బిబ్బుల్ని మేసి, మోహ
పాశాలు కళ్లనిండా తగిలించు
కుని, చిమ్మ చీకట్లు పెన
వేసుకుని, ఇంటికి వచ్చి భోజ
నంలో బొద్దికల్ని ఉమ్మేసి,
అశ్లీలరాగాల్ని ఆలాపిస్తాడు!

వీడు — అరిషడ్వర్గాల ఖడ్గాలను
కుంతలాల నిండా అంటించు
కుని, అవాఙ్మానసగోచరమైన
నిషాలో అనుక్షణం ఈదుతూ
గుండె మండపాల్లో పాషాణ
పాదుకలతో నడుస్తూ విశ్రం
ఖల వృత్తిలో గడిస్తాడు చీక
టికి కాటుక పూతలు పూసే
యశస్సహస్రాలను !

వాడు — సైకత ప్రదేశాల్లో ప్రయా
ణాలు సాగిస్తూ గిరిని
కుంజాల్లో మజిలీలు చేస్తూ

కల్లోల మాలికలు సంచీలలో
కేరుకుంటూ వర్షాతపనీహా
రాల కచ కుచ జఘనాలకేసి
వెర్రిచూపులు చూస్తూ
కేలండరు చింపేసి న్యూసు
పేపరు మీద ఉమ్మేసి శిలా
వర్త గర్తాల్లో తన డెయిరీని
పరుచుకుని ముడుచుకు పడు
కుని గుర్రుపెడతాడు!

వీడు — పరీక్షా ప్రాసాదానికి అర
గంట లేటుగా వచ్చి పాటలా
ధరల కేసి పరీక్షగా చూసి
పంచాస్త్రోపనిషన్మంత్రాలు
జ్ఞాపకం చేసుకుంటూ
పత్రం మీద నెంబరైనా
పారేద్దామని జేబు తడుము
కుని లేఖిని లేకపోగా మనో
వీధిలోంచి పుష్ప సాయకం
తీసుకుని కలల వెండి తెర
మీదికి కదిలిపోతాడు!

వాడు — మశకాలను పంజరాలలో
పెంచుతాడు! నక్తంచరులకు
సలాంలు కొడతాడు! భానూ
దయాలను నిరసిస్తాడు!
రాజకీయాల్లో యోగ్యత
గడించుకుని కళాసంపూర్ణు
డవుతూ కాలుజారి మెట్లు
మీంచి పడి వెన్ను పోగొట్టు
కుంటాడు! కానీ సంధ్యా
రాగాలు ధరించడం, ఖండ
శర్కరలు నమలడం
మానడు!

ఆమె — ప్రభాత పూజలు చేస్తూ రుద్రా
క్షలు లెక్కిస్తూ తీర్థజలం
సేవిస్తూ గగనదీపాల కోసం
అగరు ధూపాల కోసం
గడియలు లెక్కిస్తూ ఉం
టుంది కానీ అనుమానం
అలంకరించుకుని అసూ
యలో ప్రతిబింబం చూసు
కుని గండమండలం మీంచి
నవ్వుల్ని తుడుచుకుంటుంది!

ఈమె — శూన్యంలోకి కిసలయాంచ
లాలు విసురుతూ ప్రాలేయ
కాయమానం మీదికి ప్రాకి
పోతూ మత్తభృంగాల కోసం
జపిస్తూ మలయమారుతాల
కోసం తపిస్తూ భ్రూవల్లి
మీద సంధ్యారాగాలు
జారుస్తూ ఎన్ని చంద్రా
తపాలు వచ్చిపోతూ ఉన్నా
అధరాల నిండా ఒక్క నవ్వు
మాత్రం పూయదు!

అందుకే
వీళ్లనెవరినీ నమ్మలేను!
అముదాలు మొలిచిన వాకిట్లో
అమృతాలు లభిస్తా
యనుకోను!

"తమ అభిప్రాయము తెల్పుటలో నెవ్వరును, పూర్వులెంత గొప్ప వారైనను వారికి గాని, సమకాలము వారికిగాని భయపడ నక్కరలేదు. కాని నింద చేయుట కెవ్వరికిని అధికారము లేదు. నింద ప్రారంభమైనతోడనే చిత్తము వికలమగును. బుద్ధిభ్రమించును. సారాసార వివేకము నిద్రించును. హేతువాదము సున్నయగును, న్యాయము లోపించును. సత్య మడుగంటును, మానుషత్వము మాయమై క్రూర మృగత్వము సంప్రాప్తించును.
(కొమర్రాజు లక్ష్మణరావు)

# మాతృక

## కథానిక

**మల్లాది వెంకట కృష్ణమూర్తి**

నాకు తెలుగులో వచ్చే సినిమాలు తక్కువ. ఈమధ్య వచ్చిన సినిమా ''కుదరని జంటలు'' నన్నమితంగా ఆకర్షించింది. ఆంటీసెంటిమెంట్‌తో కూడిన విస్మూత్నమైన కథలో, పాత, కొత్త నటుల మేలికలయికతో, చక్కని ఛాయాగ్రహణంతో ఎంతో హుందాగా వుందా సినిమా.

అది తమిళ సినిమాకి రీమేక్. మాతృక హిట్టయిన తమిళ సినిమా ఏదైతేనేం? చక్కటి అనుభూతి కలిగించే సినిమా. నేనూహించి నట్టుగానే వంద రోజులాడిందా సినిమా.

ఈరోజుల్లో తెలుగు సినిమా వంద రోజులాడటం గగనం. వందరోజులాడిన శుభ సందర్భంగా పండగ చేయదలచు కొన్నారు చిత్ర నిర్మాతలు.

ఆ శతదినోత్సవ వేడుక హైద్రాబాద్‌లో, ఆ చిత్రం ప్రదర్శింపబడు తున్న థియటర్‌లో చేయ నిశ్చయిం చారు. అనుకోకుండా నాకు, ఇన్వి టేషన్ లభించింది ఆ వేడుకకి. నేను పని చేసే ఫేక్టరీకి పోలిథిన్ బేగ్స్ సరఫరా చేసే డీలర్ నాకు ఇన్విటేషన్ కార్డు ఇచ్చాడు. బహుశ, ఆయన గుజరాతీ కాబట్టి, ఇంట్రెస్ట్ లేక, తనకొచ్చిన కార్డ్‌ని నాకిచ్చాడు. (ఆయన బిల్స్ పాస్ చేయటం నా చెయ్యికూడా వుంది మరి).

ఉదయం, ఎనిమిదిన్నరకి, ఆ థియేటర్‌కు చేరుకొన్నాను. హాలు లోపల బయటా జనం.

ఒకానొక సుప్రసిద్ధ హాలీవుడ్ నిర్మాత ఆ రోజు హైద్రాబాద్‌లో వుండటం సంభవించిందట. 'కుదరని జంటలు' నిర్మాతలు, కుదరదంటున్నా వినకుండా ఆయన్ని అధ్యక్షుడిగా వుండ టానికొప్పించి లాక్కొచ్చారు.

కొత్త నటీనటుల పరిచయం, బహు మతులివ్వటం, వివిధవ్యక్తులు మాట్లా డటం వగైరా కార్యక్రమాలన్నీ వరసగా అయాయి.

చివరికి ఆ హాలీవుడ్ నిర్మాత మాట్లాడాల్సిన అంశం. ఆయన ఇంగ్లీ షలో ఉపన్యాసం చెప్తూంటే తెలుగులో అనువదించి చెప్పటానికి ఇంటర్ ప్రెటరిని ముందరే సంపాదించటంతో నాలాంటి వారికి ఆయన ఉపన్యాసం

# అప్పుడే ఇంత...

**'శ్రీవిరించి'**

మనోహర కవిత్వం వల్ల
మనసుకు సంతోషం
కాని - కవులు కష్టాలు
మిక్కుటంగా వర్ణిస్తారు.
అదృష్టం యే దిక్కుగా నడిపిస్తే
ఈ జీవితం అటు పయనిస్తోంది.
నా తల ముగ్గు బుట్ట అయింది
ఒకటే పళ్ళ అందరూ నన్ను
'అప్పుడే ఇంత ముసలివాడివయ్యావేం?'

మల్లె పువ్వులాంటి జవ్వని నిన్న
పుష్పగుచ్ఛ మిచ్చి చూచింది నిదానించి
పెదవి విప్పి మాటాడలేదు సుకుమారి

అర్థం చేసుకొవటానికి సహాయపడింది.

ఎక్కువసేపు మాట్లాడలేదు, మిస్టర్ జేమ్స్ పీటర్. క్లుప్తంగా ముగించాడు.

"ఈ దినం చాలా సుదినం. నాకీ అవకాశం ఇచ్చిన ఈ చిత్ర నిర్మాతలకి ప్రత్యేకంగా నా కృతజ్ఞతలు తెలియచేసుకొంటున్నాను. ఎందుకంటే ఈ 'కుదరని జంటలు' (కుడ్రన్ జాంట్లు) సినిమా చూసే అవకాశం, లేకపోతే కలిగేదే కాదు. ఇది తమిళం (టామ్లి) అనే భారతీయ భాషలో కూడ తీయబడి రజతోత్సవం చేసుకొందని చెప్పారు. నేనా సినిమా కూడ చూడాలనుకొంటున్నాను. ఈ సినిమా చాలా బాగుంది. ఆ తమిళం (టామ్లి) సినిమా ఇంకాబాగుందోలేదో నాకు తెలియలేదు. నేనా సినిమా ఇంకా చూడలేదు కాబట్టి. కాని, ఈ 'కుదరని జంటలు' (కుడ్రన్ జాంట్లు) అనే సినిమాకి ఒరిజినల్ అయిన 'ఫోర్టిన్ కేరట్స్' అనే సినిమా ఇంకా బ్లావుందని నొక్కి చెప్పగలను. కారణం నేనే ఆ చిత్రనిర్మాతని. నా అనుమతి లేకుండా ఇంత ధైర్యంగా నా చిత్ర కథని షాట్ వైజ్‌గా దొంగిలించి నన్నే ఇలా పిలవడం యాదృచ్ఛికమా? లేక తెలియకా? చెప్పగలను కారణం. 'నేనే ఆ చిత్ర నిర్మాతని. థాంక్ యూ వన్ అండ్ ఆల్ లేడీస్ అండ్ జంటిల్‌మన్."

మర్నాడు పేపరో ఇలా వ్రాశారు విలేకరులు. ప్రఖ్యాత హాలివుడ్ చిత్ర నిర్మాత మిస్టర్ జెమ్స్ పిటర్ విలేఖరుల కిచ్చిన ప్రత్యేక ఇంటర్వ్యూలో ఒకే ఒక్క వాక్యం చెప్పారు. "ఒకప్పుడు బ్రిటిష్ పాలకులు భారతీయ సంపదను కొల్లగొట్టకుపోతే ఇప్పుడు భారతీయ చిత్ర నిర్మాతలు కొందరు అమెరికన్ చిత్ర సాహిత్యాన్ని దొంగిలిస్తున్నారు. మే గాడ్ బ్లెస్ దెమ్."

కాని ఆమె భావం పసిగట్టటం
కాదు కష్టం
మిల మిల లాడుతున్న కళ్లలో
అది సుస్పష్టం
'అప్పుడే ఇంత ముసలివాడివయ్యావేం?'

జీవితం వేటలో పరవళ్లు తొక్కుతూ
పగలు రాత్రి అనకుండా
అంతటా తిరిగాను
కొండలు - కోనలు - మైదానాలు
గాలించాను
నేను విడిచిన ప్రతిబాణం అడుగుతూంది
'అప్పుడే ఇంత ముసలివాడివయ్యావేం?'

నా సహస్ర తంత్రుల వీణను
తారస్థాయిలోనో మంద స్వరంలోనో
మోగిస్తాను
నా హృదయాన్ని బద్దలుకొట్టే పిశాచి
అబద్ధాల పుట
క్రూరంగా కోరగాచూస్తూ అడుగుతాడు
'అప్పుడే ఇంత ముసలివాడివయ్యావేం?'

తల పండిపోయింది
హృదయం మటుకు సృష్ట్యాదిలో ఎంత
తేజోమయంగా వున్నదో యిప్పుడూ
అలాగే వుంది.
నా తల ముగ్గు బుట్ట అయిపోయినా
నాలో యింకెన్ని మార్పులు చేర్పులు
వచ్చినా
నా దేశం - నా ప్రజలు మటుకు
ఎప్పుడూ అనరు
'అప్పుడే ఇంత ముసలివాడివయ్యావేం?'
అని.

(Samed vurgan గీతిక ఆధారంగా)

# కచి కవిత పరిణామ దశలు

## మామ్‌జీ కె. సావ్లా

జాదెజాలు (కచ్ దేశపు రాజపుత్ర పాలకులలో ఒక తెగ), భనుసాలీలు, ఖటియాలు, ఓస్వాల్ బనియాలు, లోహనాలు, బ్రాహ్మణులు, హరిజనులు, కచ్ లోని అన్ని తెగల ముస్లిములు ఇళ్లలో మాట్లాడుకొనే భాష కచి. భారతదేశం అంతటా చెదిరి పోయివున్న మెమాన్‌లు, వాఘర్‌లకు కూడ మాతృభాష కచే. కచి భాష మాట్లాడే వారు ప్రపంచం అంతటా చెదిరి పోయివున్నారు. ఆ భాష మాట్లాడేవారి మొత్తం సంఖ్య 13 లక్షల వరకూ వుంటుందని అంచనా.

కచి భాష సింధీ భాష మాండలికాలలో ఒకటని అబ్రహాం గ్రీర్సన్ అంటారు. కచీ, సింధీ సోదర భాషలనీ, వ్రచాద్ అపభ్రంశం వీటి రెంటికీ మూలమనీ పద్మశ్రీ కె. కె. శాస్త్రి అంటున్నారు.

ప్రారంభ దినాలలో కచీ, సింధీలకు ఆర్థికంగా, రాజకీయంగా, సామాజిక, సాంస్కృతిక విషయాలతో సన్నిహిత సంబంధాలుండేవి. బ్రిటిష్ పాలన కాలంలో కచ్‌లో అంతకంత కెక్కువగా గుజరాత్ ప్రభావం బలపడింది. ఫలితంగా కచిలో గుజరాతీ పదాలు బాగా ప్రవేశించాయి. అయినా గుజరాతీ వానికి మహారాష్ట్రం, హిందీలాగ కచ్ కూడా కొత్తదే. ఉచ్చారణలో, పద నిర్మాణంలో, వ్యాకరణ ధర్మంలో కచి భాష సింధీకి దగ్గరగా వుంటుంది.

ఏ భాషలోనైనా తొలి కవితలు సాధారణంగా మత పరమైనవో, భక్తి కవితలో అయివుంటాయి.

కచ్ హరిజనుల ఇలవేల్పు మామైదేవ్ పాటలు కచి భాషలో ప్రప్రథమమైనవిగా కనిపిస్తున్నాయి. వంశ పారంపర్యపు పూజారులతో నేటికీ మామైదేవ్ గద్దీ నిర్వహించ బడుతూంది. తొలి గురువుకు ప్రస్తుత గురువు 40వ తరం వాడు. అందుచేత మామైదేవ్ 11వ శతాబ్దపు వాడు అనవచ్చు.

మామైదేవ్ పాటలు ఆ నోట, ఆ నోట ప్రచారంలో వున్నవే. వాటిలోని విషయం సాధారణ జీవిత నియమాలు, కొన్ని భవిష్యత్తును చెప్పేవి వున్నాయి. కొన్ని ద్విపదలలో భవిష్య కథనం వస్తువు. వాటికి చాలా ప్రచారం వుంది.

రాధాకృష్ణ భక్తి సంప్రదాయం ఈ యోగికి తెలిసినట్లు లేదు. వేదాంత గత ఏకేశ్వర వాదం గాని, సూఫిజం గాని ఛాయగా కూడ కనబడవు. అసలాయన కవితల్ని పద్యాలూ, పాటలూగా కూడ చెప్పలేము. అవి కొంత వరకు లయ కలిగి నడిచే వచనం. ఏకరీతిగా రెండేసి చరణాలుగా కూర్చబడి వుంటాయి. ఆయన వ్రాసిన భవిష్యవాణి గల ఒక కవిత ఇల్లా వుంది.

సింధ్ సుఖే నా వసంధీ
నౌ నౌ లగంధో దుమ్
మైశ్రీ నా రోజా సింధ్ మె

బె యా అ ద్రైజా ఘర్
(సింధులో సుఖం వుండదు. తరుచు ఏవేవో బాధలు వస్తుంటాయి. మ్రైష్రీలూ! (హరిజనులలో ఒక తెగ) సింధులో వుండొద్దు. పోయి మరో చోట ఇల్లు కట్టుకోండి).

దురదృష్టవశాత్తూ మామైదేవ్ తరవాత 17 వ శతాబ్ది వరకు కచి కవితలు ఏమీ దొరకడం లేదు. 17 వ శతాబ్దిలో మెకాన్ యోగి మార్మిక కవితలు చెప్పేడు. అంత వరకు కవితలలో వచ్చిన పరిణామ దశల్ని గురించి తెలుసుకొనేందుకు మార్గమేం లేదు.

మెకాన్ యోగి జన్మకాలం ఖచ్చితంగా చెప్పలేము. 70 ఏళ్ల వయస్సులో 1730 లో ఆయన మరణించారు. అయన పుట్టింది కచ్‌లోని ఖోంధీ గ్రామంలో. ఆయన తండ్రి హాధోజీ, భట్టి రాజపుత్ర వంశం వాడు. హాధోజీకి గల మతాభినివేశం, భక్తితత్పరత వలన గ్రామంలో ఆయనకు మంచి గౌరవం వుండేది.

కవితా వస్తువుకు సంబంధించి సంతవరకు ఆ నాటి గుజరాతీ కవులకూ మెకాన్‌కూ తేడా లేదు. అయన కవితలలో భాషపై ఆయనకుగల ప్రభుత గోచరిస్తుంది. శబ్ద సంపద, నిరర్గళ ధోరణి, సులభ గ్రాహ్యత అయన సొత్తు. అస్పష్టత, సందిగ్ధత ఆయన కవిత్వంలో చూడం. నిరక్షరులైన గ్రామీణ భక్త కోటి నుద్దేశించి చెప్పడంచేత, ఆయన కవితలలో అర్థం గాని భావ చిత్రాలుగాని, ప్రతీకలుగాని కనిపించవు.

ఆత్మానుభూతి సంపద
వటవృక్షంలా విస్తరిస్తూంది.
ఎవరడుగుతారు దానిని ?
అందుకే మౌనం వహించాను.

ఆయన ద్విపాది కవితల కిదొక మచ్చు. మామైదేవ్ కవితలతో పోలిస్తే మెకాన్ కవితలు భాషలో, సమకాలీనతలో, లయలో చాల మెరుగైనవి. ఆ కవితలలో సిద్ధాంతాల బోధ వుండదు. ఆత్మానుభవం కలిసి మెలిసి కనిపిస్తుంది.

ఆయన సమకాలీనులైన గుజరాతీ, రాజస్థానీ సాంప్రదాయిక బోధనా సాహిత్యానికి మెకాన్ కవితలు పూర్తిగా భిన్నంగా కనిపిస్తాయి. తాను మెచ్చిన దేవుని ప్రస్తుతిగాని, గుణగణ వర్ణనగాని కనబడదు. కవితోద్రేక విజృంభణకు, పిలిస్తే పలికే రాధాకృష్ణ ప్రణయ వస్తువు మెకాన్ నాటివరకూ కచి కవితలలోకి రానేలేదు. ఆయన కవితలలో కనిపించేది భక్తి కాదు, వేదాంత పారమార్థికత గాని.

మెకాన్ పదాలు వ్రాసేడు, భజనలు ఖుహాఫీలు వ్రాసేడు. కాని ఆయన దోహాల రచనలో చెయ్యి తిరిగిన వాడు.

మెకాన్ సమకాలీనులలో బహుళ ప్రఖ్యాతి పొందినవాడు భూజ్ నివాసి మీర్జాఫర్. ఈయన జబ్బార్ పేరున కవితలు వ్రాసేడంటారు. షాజహాన్ దర్బారులో కవిగా ఆయనకు విశేష ప్రఖ్యాతి వుంది.

జైనముని నిత్యలాభునికి కూడ ప్రారంభ దినాల నాటి కచి కవితల్లో

స్థానం వుంది. ఎప్పటివాడు, ఎక్కడివాడు అనేదేదీ స్పష్టంగా తెలియదు కాని, 722 - 1750 మధ్యకాలంలో వ్రాయబడినట్లు చెప్పే ఆయన కవితలు కొన్ని లభ్యం అవుతున్నాయి. 1737 లో ఆయన కచ్‌లోని అంజార్ దేవాలయంలోనూ, 1770 లో భూజ్‌లోనూ నివసించేడు. 1727 ప్రాంతంలో సూరత్‌లో వున్నాడంటారు.

నిత్యలాభముని గుజరాతీ, హిందీ, కచి భాషలలో కవితలు వ్రాసేడు. వాటిలో వస్తువు సర్వసాధారణంగా చూస్తే భక్తి, పారలౌకికత్వమూను. నిత్యం సంచరిస్తూండడంచేత ఆయనకు కొందరు గుజరాతీ కవులతో సాన్నిహిత్యం వుండేది.

మెకాన్ శిష్యుడు గంగారాం ఖువాఫీలు కచ్‌లో బాగా ప్రచారం పొందేయి. ఖువాఫీ కచ్‌లో బాగా ప్రాచుర్యం గల కవితా రూపం. దీనిని సాంప్రదాయిక రాగాలలో పాడతారు. గంగారాంకి జోగియా అభిమాన రాగం.

గంగారాం తర్వాత ఖువాఫీకి కచ్ కవితలో బహుళ ప్రాచుర్యం లభించింది. అది రాగబద్ధం కావడంచేత, భజనదాసులు గ్రామ ప్రజలలోకి తీసుకుపోవడమే ఆ ప్రాచుర్యానికి కారణం.

బిహారీదాస్‌జీ (1782), ఈశ్వర్ రాంజీ (1825), రతన్‌బాయ్ (1893), కవికేశవ్ (1775), మియాసాబ్ (1915), సాధుతిలక్ దాస్‌జీ (1859) పేర్లు ఈ కవితా రూపంతో బాగా ప్రసిద్ధి పొందేయి.

ఖువాఫీలతో కచి కవిత్వం వేదాంతిక పారమార్థికత నుంచి, తాత్విక పలాయనవాదం నుంచీ బయట పడింది. సగుణభక్తి, రాధాకృష్ణ ప్రణయమూ దానికి జీవాన్నీ ఓజస్సునూ కల్పించేయి. ఈ కవితలు సాంప్రదాయిక సంగీతాన్ని నిలబెట్టేయి. అంతే కాదు, ఢోలక్ వాద్యకళను పెంపొందించేయి. భక్తకవి ప్రతాపదాస్‌జీ జాదెజా కవితలలో గోపీకృష్ణ ప్రణయం వర్ణితమయింది. ఈయన గుజరాతీ కవి కలాపితో దగ్గర సంబంధం కలిగి వుండేవారు.

ఇరవదవ శతాబ్ది ఆరంభంలో రాఘవజీ కచి కవితను నూతన మార్గాలలో నడిపించేరు. గుజరాత్ కవి ఆఖా లాగానే రాఘవజీ తన కవితలలో దొంగ సాధులను దుయ్యబట్టేరు. అయితే ఆఖాలాగాక ఆయన తన కవితలలో సంస్కృత పదాలను బహుళంగా వుపయోగించేరు. ఆయనతో కచి కవిత భక్తి సంప్రదాయం నుంచీ, పలాయనవాద లక్షణం నుంచీ బయట పడింది.

పాతకాలపు సాంప్రదాయిక కవితకూ, ఆధునిక కవితకూ దులెరాయ్ కరనీ వారధి లాంటివాడు. ఈయన సజీవుడు. 80 ఏళ్ల వాడు. ఈయన అనేక విషయాల మీద గ్రంథాలు రాసేరు. మానవానుభూతులకు కవితలలో ప్రవేశం కలిగించేరు. కచ్ భూభాగ సౌందర్యాన్ని చాల నిశితంగా వర్ణించేరు. ఆ భూభాగం మీద, ఆ భాషమీద ఆయనకు గల ప్రేమ ఆయన కవితలలో చిప్పిల్లుతూ వుంటుంది.

కథలు, కవితలు, నాటకాలు, చరిత్ర, జానపద కథలు, జానపద కవితలు, పురాణగాథలు మొదలైన ఆయన రచనలు 35 సంపుటాలలో ప్రచురించబడి

నాయి. కచి భాషను, దాని సాహిత్యాన్ని ఆయన తన రచనలతో సుసంపన్నం చేశారు.

కాని, గుజరాతీ, హిందీ లలాగో, మలయాళం, బెంగాలీ లలాగో కచి కవిత అభివృద్ధి పొందిందన లేము. అది చాలా వెనకబడేవుంది. అయితే ఇటీవల నూతన తారలు కచి కవితాకాశంలో మినుకు మినుకు మంటున్నాయి. కవి తేజ్, ప్రతాప్‌రాయ్ త్రివేదీ, మఖ్బాల్ కచి, మాధవ్ జోషి, మదన్ అంజారియా, చందూబా జాడెజా, పండిట్ రత్నేశ్వర్, కేశవ్‌లాల్ మెహతా, ప్రేమ్‌జీ సంగోయ్, ఉస్మాన్ సత్రీ, హెచ్. ఐ. ఖత్రీ, అమృత గంగార్ మొదలైనవారు.

కీ. శే. జేత్మల్ ధక్కర్ ముక్తకాలు ఉపనిషన్మంత్రాల లాగ వుంటాయి. శక్తివంతమైన పదాలతో, అర్థపూర్ణంగా, మనస్సును ఆకట్టుకుంటాయి. ప్రతాప్‌రాయ్ త్రివేదీ సంస్కృత పద భూయిష్ఠంగా, అలంకారాలతో, సాంప్రదాయిక ఛందస్సులలో వ్రాస్తారు. వాటిలోని విషయానికి ఏ మాత్రం ఆధునికత్వం వాసనే వుండదు. కాని అందంగా, మనోరంజకంగా వుంటుంది. చందూబా జాడెజా భక్తి సంప్రదాయానికి వారసుడు. ఖవాఫీలలాగ రాగబద్ధంగా వ్రాస్తాడు. మఖ్బార్ కచి (80 ఏళ్లవాడు. ప్రస్తుతం పాకిస్తాన్‌లో వుంటున్నాడు). కవితలలో కచి భాషలోని సహజాసక్తి, సౌందర్యం శుద్ధ రూపంలో ప్రతిబింబిస్తుంది. ప్రకృతిని వర్ణించినా, ఏదో సామాజిక సమస్యని ఎత్తుకొన్నా, హాస్యం చేసినా, అపహాస్యం చేసినా నవ్యత్వాన్ని చూపిస్తుంది. కవితలోని లయ సెలయేటి గతిని తోపింప చేస్తుంది. ఛందస్సు నాయన ఎన్నడూ లెక్క చేయలేదు. అయితే ఆ కవితలు మధుర సంగీతబద్ధమై వుంటాయి. వాటిని పండిత పామరులుభయులూ మెచ్చుతారు.

మాధవ్ జోషి కవిత్వం కూడా అటువంటిదే. అయితే చిత్రం ఏమంటే జోషి కవితలలో సింధీ పదాలు దండిగా వుంటాయి. మఖ్బాల్ సింధులో (కరాచీ) వుంటున్నా, తన కవితలలో సింధీ పదాన్ని ఎక్కడో కాని వుపయోగించరు.

కవి తేజ్ కచీలో మంచి భవిష్యత్తు గల కవి. ఆయన కవితా సంపుటులు రెండు ప్రచురించబడినాయి. ఛందస్సు శృంఖలాలను వదల్చుకొన్నాడు. భక్తి సంప్రదాయం దరిదాపులలో కూడా వుండడు. నిశిత పరిశీలన, హాస్యదృష్టి, కవితాధార, ప్రతిస్పందన ఆయనలోని అసాధారణ ప్రతిభను వ్యక్తపరుస్తున్నాయి. తేజ్ జన్మతా కవి. ఒక గ్రామంలోని ధర్మశాలలో గుమస్తా. ప్రాథమిక విద్యను కూడా పూర్తి చేయలేదు. ఆయన కవితా వస్తువు చాలా వైవిధ్యం గలది. ప్రతీక ప్రతిబింబాలతో ప్రకృతిని మన కళ్ల ముందు పెడతాడు. జీతం రోజుకోసం ఎదురు చూస్తున్న గృహిణి, వీధిలో పేడ ఏరుకునే ముసిలిది, పక్షులు, జంతువులు, ప్రేమ, ఉద్రేకం, ఆశ, నిరాశలు అన్నీ ఆయన కవితా వస్తువులే. ఒక్క ఘజల్‌లు మాత్రం ముట్టుకోడు. మిగిలిన అన్నింటా చెయ్యి తిరిగినవాడు.

మదన్ అంజరియా, హెచ్. ఐ. ఖత్రీ ఘజల్‌లను విజయవంతంగా ప్రస్తరించేరు. మదన్‌లో వస్తు వైవిధ్యం చాల ఎక్కువ. కాని గుజరాతీ కవుల మాదిరిగా

ఆయనకు ఉర్దూ పదాలమీద మోజు చాల ఎక్కువ. ఖత్రీ ఘజలులు ఛందో బద్ధంగా వుంటాయి. కవి సహజ సౌందర్యం ఏ మాత్రం చెదిరి పోకుండా వాటిలో కనబడుతుంది.

అమృత గంగార్ కవిత పూర్తిగా ఆధునికం. నిస్పృహ, చిరాకు, నిరాశా ధోరణి, బూర్జువావర్గం యెడ తీవ్రవ్యతిరేకత మొట్టమొదటిసారి కచి కవితలలో అమృత గంగార్ ప్రవేశ పెట్టేడు. పట్టణవాస జీవితపు నగ్న వాస్తవాలు, పెద్ద నగరాలలోని మురికి పేటలు, పేదలపై సాగుతున్న దోపిడీ – ఈ నగ్నసత్యాలు ఈ పచ్చిపుండ్లు – ఈ యువకవి కవితలో చాల బలంగా వ్యక్తీకరించ బడు తున్నాయి.

ఈ విధంగా కచి కవిత్వం నూతన రూపం తీసుకొంటూంది. ఇది కొందరు యువకవుల ద్వారా పునరుజ్జీవం పొందే సూచనలు కనిపిస్తున్నాయి. భారతీయ సంస్కృతిని, ప్రత్యేకించి కవితా వాహినిని సుసంపన్నం చేయడంలో దాని పాత్ర గణుతించతగినదే.

('ఇండియన్ లిటరేచర్' నుంచి)

## కూలి దండు కదిలింది!

### త్రిపురారి

కూలి దండు కదిలింది!
కదిలిందీ కదిలిందీ
కూలి దండు కదిలిందీ!

జనం కళ్ళు తిరుగగా
ఊరవతల నీరింకిన
పొలాలన్ని అదరగా
॥ కూలి ॥

ఈ నాగళ్ళూ పిడికిళ్ళూ
పిడికిళ్ళు నాగళ్ళు
పిడికిళ్ళు కొడవళ్ళు
మనవే మనవే మనవే
॥ కూలి ॥

పల్లెలన్ని చుట్టేసి
పట్టణాల కెళ్తున్నాం
పల్లెలన్ని ఉడికించి
పట్టణాల కెళ్తున్నాం
జనం, జవం మాతో
కలిసి బ్రతుకుతుంది
భయం గియం మాకు
దూరమై పోతుందీ
పల్లెలతో పట్టణాలు
చెలిమి చేస్తున్నాయ్.
కార్మికులు కర్షకులు
ఒకటే నండీ! ॥ కూలి ॥

కర్మాగారాలు కూడ
కదిలె నవిగో చూడండీ!
అవే అవే
ధనస్వామి గుండెలదరు
పొగగొట్టపు ధ్వనులు
ధనస్వామి కళ్ళుచెదరు
కూలి దండు నదులు
కార్మికులు కర్షకులూ
చేతులు కలిపేరు
సుత్తెలు కొడవళ్ళూ
ఒకటై చేరేను
మెరుపు మెరిసేను.
ఈ మెరుపుల నాపలేరు
ఈ శక్తికి అడ్డులేదు -
॥ కూలి ॥

యువజన
విద్యార్థి – యువజన మాస పత్రిక
ప్రతి రూ. 1 సాలు చందా రూ. 10
హిమాయత్ నగర్, హైదరాబాద్ - 500 029

కథానిక తమిళం

# వీధి దీపం

## పుదుమైపిత్తన్

వీధి కొనలో, మలుపు దగ్గర, మునిసిపాల్టీ దీపం ఒకటుంది.

వంటరిగా వుందది, తన మసక వెలుగు వెయ్యడానికి ప్రయత్నిస్తూ ఏకాకిగా వుంది.

యవ్వనం. వృద్ధాప్యం, చావు - యివి మనుషుల హక్కులు మాత్రమే కావు. కాబట్టి వీధి దీపానికిప్పుడు వృద్ధ్యాప్యం.

నిటారుగా వున్నదాని స్తంభం - కాస్తంత ఒంగింది. పైనున్న అద్దం ఒక వేపు పగిలింది. సరదాకి కుర్రాడొకడు రాయి విసిరాడు, దీపానికది ఎలా కీడు చేస్తుందో వాడాలోచించేడా? గాలి వీచేటప్పుడు, దాని ప్రాణాన్నది ఒక్క దెబ్బను హరిస్తుందా? కాస్త కాస్తగా చంపుతుంది - ఎంత బాధ!

మసక మసకగా నయినా దీపం కొద్దిగా వెలుగు యిస్తున్నందుకు, గాలి కృతజ్ఞత చూపొద్దూ ?

అదారిపోయింది! వాన కురిసేటప్పుడు దానికి చలివేస్తే ఖాతరు చేసేదెవరు?

గాలికిది తెలుసా?

ప్రపంచంలోని యీ మూలలో, యిక మీదట వీధి దీపం అవసరం లేదని అంటున్నారు. "పోతే పోనీ" అంటున్నారు.

దాని స్నేహితుడు - ఒక ముసలతను

ఒకే వయసువాళ్లు ఒకళ్ల నొకళ్లు అంటి పెట్టుకుని వుంటారు. ఆశ్చర్యమేముంది?

ముసలతను, దీపం.

దీపం, ముసలతను

దీపాన్ని తీసుకపోతారని ముసలాయనకు తెలీదు.

అతనికెలా తెలుస్తుంది?

కడుపు నింపు కోడం కోసం, అడుక్కోవడానికి అతను వెళ్లద్దూ?

కడుపుకేదో కావాలి. లేకపోతే తను బతికేదెలా?

వీధి దీపం అతనికి నిజంగా నేస్తం. దాని వెలుగు అతని కెంతగా ఊరట నిచ్చింది! ఆ సాయంత్రం అతనక్కడికొచ్చాడు. దీపం వుండిన చోట ఒక కన్నం మాత్రం వుంది. అంతా చీకటిగా వుంది. కటిక చీకటి. గుడ్డివాడి చేతి కర్ర లాక్కుపోయినట్టయ్యింది.

ఆ రోజు లోకం అతనికి శూన్యం అయ్యింది, నిస్సారం అయిపోయింది, అర్థం లేకండా పోయింది.

శాంతి - ఎక్కణ్నుంచొస్తుందది?

కేవలం పగిలిన వీధి దీపం! అయినా అది అతన్ని ఓదార్చింది కాస్త.

నిజమే, అతనికి రవ్వంతే వెలుగు అయినా దాన్నతననుభవించాడు - రాతి స్తంభం యిచ్చింది. దాన్నుంచి తాను పొందిన సుఖాన్నిచింది.

మర్నాటి ఉదయం, ముసలాడి శవం అక్కడ పడివుండడం అంతా చూశారు.

ఇప్పుడు సరికొత్త దీపం.

ఎలెక్ట్రిక్ దీపస్తంభం.

దానికింద పిల్లలు సరదాగా ఆడుకుంటున్నారు.

మనిషినీ, దీపాన్నీ వాళ్ళెందుకు ఖాతరుచేస్తారు? - రెండూ ముసలివే.

తామూ యిలాగే అయిపోయే కాలం వస్తుంది.

అయితే ఎప్పుడూ, ప్రతిచోటా జరుగుతుంది. పాత మారుతుంది. దాని చోట్లో కొత్త వస్తుంది. ప్రపంచం తీరు – అనంటారు!

# వీరేశలింగం

(శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'అనుభవాలూ జ్ఞాపకాలూనూ' నుండి)

వీరేశలింగం గారు, రచన యెంత సులువుగా చెయ్యవచ్చునో చేసి చూపించారు.

ఎంత సులభభాషలో చెయ్యవచ్చునో చూపించారు.

అది ఎన్నిరకాలుగా చెయ్యవచ్చునో చూపించారు.

తన్మూలంగా, ప్రజయోనాలే కాక, ఆనందం కూడా ఎన్ని రకాలుగా కలుగుతుందో చూపించారు.

వాఙ్మయం శక్తి ఎంతటిదో జాతినది ఎలా నడిపిస్తూందో కూడా చూపించారు. (మూడవ సంపుటం).

గతానికీ, అగతానికి కూడా వీరేశలింగం గారొక్కరే ఆ పని (గద్య రచన) చేశారు.

పంతులు గారి పూనిక వల్లనే గద్య వాఙ్మయం విలువలు మనకు తెలిసి వచ్చాయి.

పంతులుగారి మధుర రచనల తోనే మనకు గద్యప్రీతిన్నీ కలిగింది, బలాపడింది.

జన సామాన్యమున్నూ బాగా కళ్ళు తెరిచింది.

పంతులుగారు కటిబద్ధులు కాక పూర్వమూ పంతులుగారి వరవడితో గద్య వాఙ్మయమూ పెద్ద యెత్తున ప్రారంభం అయిన తరువాత, జన సామాన్యం అంతస్థు పెరగడం గుర్తించగలవారికిది చెప్పనక్కరలేదు.

నిన్నటిదాకా మెయిలు వేగంలో వుండిన పద్యవాఙ్మయ ప్రచారం ఇవాళ వొంటెద్దు బండి నడకలో వుండడం చూస్తే, ఆంధ్రజాతి పురోగమనమున్నూ విశదంగా తెలుస్తుంది.

వచన రచన చేసే మహాకవుల సంఖ్య దగ్గర, పద్య బంధంచేసే మహాకవుల సంఖ్య చాలా స్వల్పం.

ఆంధ్రజాతి అచిర కాలంలోనే సర్వతోముఖంగా వికసిస్తుందనడానికిదొక సూచన.

దీనికి పునాది వీరేశలింగం పంతులు గారి గద్య రచన.

ఇంచేతనే పంతులు గారి వాఙ్మయ సేవకంత గౌరవం.

అంత ప్రఖ్యాతిన్నీ. (రెండసంపుటం)

## జీవన సౌధం

### పరమాణువు

నిన్న
నిన్ననే చచ్చిపోయింది
దానికోసం చింత ఎందుకు
రేపు
రేపుగానీ పుట్టదు
దాని కోసం
ఎదురు చూడకు.

నేడు
ఇపుడు నీ చేతుల్లో ఉంది
దానిని ఉపయోగించుకో
చెయ్యాలనుకున్న పనికి
ఈ రోజే పునాది వెయ్యి
నిన్నటి సమాధి మీద
రేపటి భవనం
తయారవు తుంది.
అది నీకు–
అందాల జీవన సౌధం
అవుతుంది.

కథానిక ఫ్రెంచి

# వయొలిన్

రిచర్డ్ ఒమాన్రోయ్
(1849 - 1916)

మొన్న రూదే ప్రొవెన్స్‌లో వెడుతూ ఒక పాత సామాన్ల షాపు ముందు యాదాలాపంగా ఆగేను. తల ఎత్తేను కదా, అది మదాం మాంచబెల్లే దుకాణం. ఆమె కూతుళ్లిద్దరూ కోర్దే భావేలో వున్నారు. వాళ్లలో రెండోది రివటలా వుంటుంది గాని పెద్దామెది చక్కని విగ్రహం. అయితే వాళ్ల కోసం తలుపు తోశాననుకో వద్దు. ఏమీ కాదు. ఒక కంకణం కొనడానికి మదాం మాంచబెల్లె సలహా తీసుకొందామను కొన్నాను. కాని ఎదురుగా పురాతన కాలపుదిలా కనిపిస్తున్న వయొలిన్ నా దృష్టిని ఆకట్టుకొంది.

"ఓ, మదాం మాంచబెల్లే! మీరు వాద్యసాధనాలు కూడా అమ్ముతున్నారేమిటి? వేన్నీళ్లకి చన్నీళ్లతోడు. బాగుంది. అయితే ఓ మాట. దీనిని మాష్యూర్ ప్లకేకి ఎందుకు బహుమతి చేయకూడదు?"

"అల్లాంటి మాట నావద్ద చెప్పకండి. ఆ విధంగా బహుమతులిచ్చి ప్రొఫెసర్లని మంచిచేసుకోడం నాకు నచ్చదు. మా జూడీత్ విలువ నాకు తెలుసు. రెబెక్కా విషయం ఆలోచించనే అక్కర్లేదు. మా అమ్మాయిల అదృష్టం ఎల్లా వుంటుందోనని నాకేం ఆదుర్దాలేదు. ఫర్వాలేదు. ఈ వయొలిన్ వుంది చూశారూ, అది నే చేద్దామనుకున్న సత్కార్యానికి రుజువు లాంటిది".

ఆశ్చర్యంగా తోచింది. ఎందుకనిపించిందో చెప్పలేను కాని, మదాం మాంచబెల్లేకీ, సత్కార్యానికి సంబంధం వూహించలేకపోయాను. అటువంటిది సాధ్యమనిపించలేదు.

"మీకాశ్చర్యంగా వుంది కదూ. నే నెరుగుదును. అయితే నా సత్కార్యం నెరవేర లేదనుకోండి. ఆ అనుభవం అయ్యాక మళ్ళీ అల్లాంటిది తల పెడతానను కోండి. ఇంతకీ ఆ వయొలిన్ ఖరీదు ఏమాత్రం వుంటుందంటారు?"

ఆ వయొలిన్ తీశాను. చిన్నపిల్లల ఆటవస్తువులా వుంది. వాడి వాడి అరిగిపోయివుంది. అనుమానానికి కూడా తావు లేనట్లు చెప్పాను:

"మహా అయితే పన్నెండు ఫ్రాంకులుంటుంది".

"ఔనా? దానికి నేను నాలుగు వందలు ఇచ్చేను."

ఉలిక్కిపడ్డాను. హాస్య మాడుతూందనుకున్నాను. కాని కళ్లజోడు వెనక మదాం మాంచబెల్లే కళ్లలో నీళ్లు. నా మనసు చాల మెత్తన. మొసలి కంట్లోనైనా, మరీ ఆడ మొసలి కంట్లో అయితే మరీను, తడి చూస్తే మనస్సు వుండబట్టదు. ఆ ముసలి మొసలి – క్షమించండి, మదాం మాంచబెల్లే చేయి పట్టుకున్నా.

"అసలు కథేమిటి? చెప్పండి. మనస్సు తేలికపడుతుంది".

"మాష్యూర్ రిచర్డ్, పాత గాయం మళ్లి కేలుకుతున్నారు. అయితేనేం. అడిగేరు కనక చెప్తాను. శీతాకాలం ఓ రోజు పొద్దున్నే రెబెక్కా, జూడీత్ నాస్తా

పూర్తిచేసుకొని 8గంటల క్లాసుకి పరుగెత్తి పోయేరు. నేను పింగాణీ సామాను మీది దుమ్ము దులుపుతున్నాను. దుమ్ము దులపడం ఒక కళ. ఆ పని నాలా చెయ్యగల వాళ్లు లేరు. బహుశా నా చేతుల్లోని ఆ నాజుకుతనమే నా కూతుళ్ల కాళ్లకు వచ్చివుంటుంది. ఆ సమయంలో ఓ ముష్టి పిల్ల కొట్టులో కొచ్చింది. ఆ చింకి గుడ్డల్లోనే ఆ పిల్లది ఎంతో చక్కగా వుంది. చిన్న పిల్లలు తమ విలువేమిటో వాళ్లే ఎరగరు కదా అనుకొన్నాను. కొట్టులో కొచ్చింది. చేతిలో వుందీ వయొలిన్. ఏమన్నా అడుగు తుందనుకొన్నాను. నాకో నియమం వుంది. ఎరిగినా ఎరక్క పోయినా అడక్కొనే వాళ్లకి ఏమీ ఇవ్వకూడదని నా నియమం. కాని, ఆ పిల్లది ఏడుపు మొదలెట్టిందే.

"కోప్పడకండమ్మగారు!మాఅమ్మకి రొట్టె కొనాలి. ఆకలంటూంది. పది గంటల వేళ జనం వీధులంట నడుస్తున్నప్పుడు పాటలు పాడి, మధ్యాహ్నానికల్లా మీకు తిరిగి ఇచ్చేస్తా. పక్క వాయిద్యం లేకుండా పాడగలను. ఈ వయోలిన్ తాకట్టుంచుకోండి. ఇరవై 'సో' లు ఇవ్వండి. ఇది పూర్వ కాలపు వయోలిను. మా ముత్తాతదిట. ఏమిచ్చినా అది అమ్ముకోను. నా మాట నమ్మండి."

"సరే, ఏం పోతుందిలే అనుకున్నా. ఇరవై 'సో' లూ ఇచ్చి, వయొలిన్ అట్టే పెట్టుకొన్నా."

"అవునూ, దాని ఖరీదు నాలుగు వందల ఫ్రాంకులన్నారు కదూ."

"తొందర పడకండి. పదకొండు గంటలప్పుడు ఓ పెద్దమనిషి షాపులో కొచ్చేడు. పెద్ద పేరున్న వుద్యోగస్త డల్లె వున్నాడు. మహా గంభీరంగ వున్నాడు. ఆ వీనస్ బొమ్మని ప క్షించేడు. లూయీ క్వింజే గడియారం చూసేడు. హఠాత్తుగా ఈ వయొలిన్ ముందుకొచ్చి అల్లాగే నిలబడిపోయేడు

"అది చేతిలోకి తీసుకొన్నాడు తడిమి చూసేడు. పెట్టెమీద వేలితో కొట్టేడు. అమ్మేటట్లయితే అయిదు వంద ఫ్రాంకులిస్తాను. ఔనూ, కాదూ అని చర్చ ఎందుకు"?

అంత డబ్బు అనేసరికి నా తల తిరిగిపోయింది.

"అది నాది కాదే. ఓ గాయకుడు దీని నిక్కడ పెట్టి పోయాడు. దానిని అమ్మననే చెప్పేడు. వాళ్ల ముత్తాతల నుంచి ఇంట్లో వారసత్వంగా వస్తూందట. మహా దరిద్రంలో వున్నాడు. కొద్ది పెన్నీలు బదులిచ్చాను. అయినా బేరం కుదర్చ వచ్చు ననుకుంటాను."

'మదాం కొంచెం శ్రద్ధగా వినండి. నాకీ 'స్ట్రాదివారియస్‌ని అయిదు వందల ఫ్రాంకులకి బేరం కుదిర్చి పెట్టేరా - మీకు రెండువందలు కమీషను ఇస్తాను. అంటే ముప్ఫయ్యయిదు లూయీలు వదలిపోతాయన్న మాట. అయితే నేమంట. ఫర్వాలేదు. అటువంటి ఖర్చు చేసినా మరేం నష్టం వుండదు. అంత పెట్టినా ఇంకా లాభం వుంటుంది."

"అల్లాగే! మాష్యూర్. మధ్యాహ్నం రాండి. అప్పటికి ఆయనతో మాట్లాడి వుంచుతాను".

మధ్యాహ్నం వేళకి ఆ అమ్మాయి వచ్చింది. చెప్పొద్దూ ఆ ఇరవై 'సో'లూ తెచ్చిఇచ్చింది.

"మదాం, చెప్పినట్లు వచ్చేశా. ఇదిగో మీ డబ్బు. నాకెంతో వుపకారం చేశారు. సరిపడిందా? ఇంక నా వయొలిన్ ఇప్పించండి'.

"అమ్మాయి, నేచెప్పేదివింటే బ్రహ్మానంద పడిపోతావు. నీ వయొలిన్‌కు ఓ ముసిలాయన మూడు వందల ప్రాంకులిస్తానన్నాడు."

"మాటకి అడ్డం వచ్చాననుకోకండి. అయిదు వందలిస్తా నన్నాడని కాదూ, అన్నారు?"

"నిజమే ననుకోండి మహాశయా! మనం మాత్రం తప్పు చెయ్యమనేదేముంది? ఈ చెత్తకారీ వస్తువుకి పది హేను లూయీల నవసరం అనిపిస్తూనే వుంది. ఆ మాత్రం దానికి చెట్టు దులిపినట్లే కదా. ఆ మాట విని సంతోషం పట్టలేక తల్లక్రిందులయి పోతుందనుకున్నా. ఏమీ కాలేదు. ఆ మాట అన్నందుకు గొడవ చేసేసింది. అది వాళ్ల ముత్తాతగారిదిట. ఇంట్లో వుండాలిసిందే నంది. ఎంతో బాధపడుతూనే బేరం నాలుగు వందలకి పెంచాను. అక్కడికి నాకోఅయిదు లూయీలుంటాయి కదా అనుకున్నాను".

"ఆ రెండు వందల ప్రాంకుల కమీషను గాక" - అన్నాను.

"ఔను. ఆ కమీషను కాక. వ్యాపారం వ్యాపారమే. రెబెకా, జూడిత్ ఇప్పుడు సంపాదిస్తున్నారు, గాని ఆనాడు వాళ్లకయ్యే ఖర్చులో యిది తెచ్చేదేంత? చిట్ట చివరకి ఆ ముష్టిది ఒప్పుకుంది. నాలుగువందలు ప్రాంకులూ ఇచ్చిస్ట్రాదివారియస్‌ను తీసుకున్నాను."

"అదా" అన్నాను.

"పట్టి మోసం మహాశయా! వట్టి మోసం. పెద్దమనుషుల్లా కనిపించే వాళ్లనే నమ్మలేకపోతే మరెవర్ని నమ్మడం? ఆ పెద్దమనిషి వట్టిదొంగట. ఆ ముష్టిపిల్లవాడికి తోడట. మళ్ళీ వాళ్లు నా కంటబడలేదు. అప్పటి నుంచి ఈ వయొలిన్ నావద్దనే వుండి పోయింది."

## సవిత్రుడు . . . . . హరగోపాల్ ఎస్.

ఎక్కడ కన్నీళ్ళూ, బాధలుంటాయో
అక్కడ నేనుంటాను.
ఎవరి కవోష్ణ రక్తాలూ, స్వేదాలూ
ఈ ఇలాతలాన్ని
బంగారం చేస్తున్నప్పటికీ,
వాళ్ళకింత కూడు,
వారి బ్రతుకుల కింత నీడా
లేకుండా పోయిందో
— అక్కడ
వేదనతో మ్రగ్గుతోన్న వాళ్ళ పిడికిళ్ళు
తిరుగుబాట్లతో బిగియడానికి,
వాళ్ళ మనః క్షేత్రాల్లో బలిసిన
అంధ విశ్వాసాల, భ్రమల కంపతుప్పల్ని
నరకడంలో, కొడవళ్ళు తెగడానికి!
వెలుగు బాటల్లో
వాళ్ళు కన్నీళ్ళూ, బాధలూ లేని
ప్రపంచానికి నడవడానికి
—నేను అక్కడే ఉంటాను
వాళ్ళ గుండెల్లో చైతన్యాన్ని రగిలిస్తూ,
వాళ్ళను విప్లవాల్లోకి నడిపిస్తూ,
వాళ్ళ మేధస్సులకు పదును పెడుతూ
అక్కడే ఉంటాను నేను -
కవిని,
నవోదయ గీతికా భారవిని

# ధీరులు

**కథానిక**

**డాక్టరు ఎ. విజయలక్ష్మి**

మధ్య మెట్టు మీద ఒక నిమిషం ఆగి అలుపు తీర్చుకుని, మళ్ళీ ఎక్క సాగింది వసంత. తన భర్త, మిగతా లెక్చరర్స్ ఎంత ఎగతాళిగా నవ్వినా తన అలవాటు మార్చుకో లేక పోతూంది.

"ఎందు కంత గొంతు చించుకుని ప్రతి ఒక్కడినీ అర్థమయిందా అర్థ మయిందా అని పరామర్శించి మరీ పాఠాలు చెప్పడం ?! నీ నిజాయితీని, కర్తవ్య నిర్వాహణని గుర్తించి ఏలిన వారు ఏ 'పద్మవిభూషణ్' బిరుదుతోనో సత్కారిస్తారని పేరాశ పడుతున్నా వేమో ! ఇలాగే శ్రమించిన యావంటే 'పద్మభూషణ' బిరుదుకు బదులు, పల్మ నరీ ట్యూబర్క్యులోసిసో', లేకపోతే ఏ 'థ్రోట్ కేన్సరో' వస్తుంది జాగ్రత్త" అంటూ చిరాకుపడతాడు వసంత భర్త మోహనరావు.

ఈ ప్రభుత్వం వారిచ్చే యింతోటి జీతాలకి ఎందుకండీ వసంతగారూ, అంతకష్ట పడడం! టయిముకు వెళ్ళి క్లాసులో కూర్చొని నోటి కొచ్చింది నాలుగు ముక్కలు చెప్పి, గంట కొట్ట గానే బయటికొచ్చేస్తే మనని అడిగే దెవరు ? అదృష్టం బావుండి చేతకాని ప్రిన్సిపాలెవరైనా వస్తే మన రొట్టె విరిగి నేతిలో పడినట్లే. అసలు క్లాసుకే వెళ్ళక పోయినా అడిగే నాథుడుండడు. స్టూడెంట్స్‌కి మీకు వచ్చిందంతా నూరి పోసి విజ్ఞానఖనుల్ని చెయ్యాలనే చాదస్తాన్ని వదులుకోక పోయారంటే, అసలే మీ ఆరోగ్యం అంతంత మాత్రం- మీకొచ్చే జీతం మీ మందుల క్కూడ సరి పోదు. వసంత గారూ! అనుభవజ్ఞులం మేంచెప్తున్నాం వినుకోండి. మనం ఎదురు చూడాల్సింది 'బిల్' కోసం, 'బెల్' కోసం. విద్యార్థుల బాగు కాదు". అంటూ నీతిబోధ చేస్తారు, వసంత తోడి లెక్చరర్స్.

వసంత కామాటలన్నీ గుర్తొచ్చి, సన్నగా నవ్వుకుంది. పై అంతస్తులో, కొచ్చేసరికి ఆయాస మొచ్చినట్లయి, రెయిలింగ్‌ని పట్టుకుంది. కళ్ళు తెరిస్తే

# తమిళ మినీ కవితలు

అనువాదం :

**చల్లా రాధాకృష్ణశర్మ**

## * దేశభక్తి *

మా కుటుంబంలో
దేశభక్తికి కొదువ లేదు.

తాతయ్య యేమో
ఢిల్లీ .... ఢిల్లీ....

నాన్న యేమో
కేరళ ... కేరళ ...

అన్నయ్య యేమో
ఒరిస్సా ... ఒరిస్సా ...

అక్కయ్య యేమో
కర్ణాటక ... కర్ణాటక ...

తమ్ముడి కేమో
ఉ. ప్ర.... ఉ. ప్ర...
నేనూ, అమ్మా,
చెల్లెలు (ముడేళ్లది)
తలా ఒకరికి
ఒక్కొక్క రాష్ట్రం
లాటరీ టికెట్లు అమ్మడం.
తమిళనాడులో నివసించే
మా కుటుంబంలో
దేశభక్తికి కొదువ లేదు.

నిమల విశ్వనాథన్

అంత పెద్ద బిల్డింగ్ తల్ల క్రిందులవు తున్నట్టనిపించి, కళ్ళు మూసుకుంది. పదడుగులు వేస్తె స్టాఫ్ రూమ్ వచ్చే స్తుంది. నాలుగడుగులు బలవంతాన వేసేసరికి నాలుగు మైళ్లు నడిచినట్టని పించి గోడని ఆసరా చేసుకుని నిల బడింది. తననా స్థితిలో ఎవరైనా చూస్తా రేమోనని బెదురుగా చూసి, కళ్ళు తిరగడంతో గట్టిగా మూసుకుంది. స్టాఫ్ రూమ్ లోనుంచి ఘొల్లుననవ్వులు వెకిలి మాటలు వసంత చెవుల్లో పడ్డాయి. వసంత దిగ్భ్రాంతితో మాటలు వింటూంది.

తమ కో లెక్చరర్ మాధవ రావు భార్య వనజ గురించి ఆ విసుర్లన్నీ. ఉత్తుంగజలపాతంలా, పరుగులు పెడు తున్న ప్రవాహంలా, కొంచెం ఎక్కువ వేగంతో వీస్తున్న మలయమారుతంలా వుంటుంది వనజ. గలగలా నవ్వుతూ, ఎంత క్రొత్త వారితోనైనా సరే వర సలు కలిపేసి, ఆత్మీయంగా మాట్లాడే వనజని చూస్తే, ఆశ్చర్యం కలుగుతుంది. స్వార్థం, కపటం, హిపోక్రసీ రాజ్య మేలుతున్న ఈ రోజుల్లో ఇంత నిస్సం కోచంగా, నిష్కల్మషంగా ఎలా ప్రవర్తించ గలుగుతూందీ అమ్మాయి! ఇంత స్వేచ్ఛగా హాయిగా ఎలా నవ్వ గలుగుతూంది - అనిపిస్తుంది. కాని ... ఆమెనెంత నీచంగా చిత్రించుతున్నారు వాళ్ళు! వసంతకి నీరసం ఎక్కువయి నట్లు అనిపించింది.

"ఇంటి కెళ్తే చాలు అన్నయ్యగారు, అన్నయ్యగారంటూ జిడ్డులా పట్టు కొంటుంది. ఒదిలించు కుందామన్నా, ఒక్కపట్టాన వదలదు" ఒక గొంతు వక్రభాష్యం. హృదయంలో మెత్తని చోటునేదేలేని కఠినుడివి, ఆ అమ్మాయి ఆప్యాయత జిడ్డులా కనబడడంలో ఆశ్చర్యంలేదు, అనుకుంది వసంత.

"అన్నీ భోగంవేషాలు! మాధవరావు కాబట్టి ఊరుకుంటున్నాడు. నేనయితేనా, నరికి పోగులు పెట్టేవాణ్ణి" ఒకగొంతు బీరాలు ... అంత మంచి అమ్మాయినే యింత దరిద్రంగా చిత్రిస్తున్న వాళ్లు ఏ ఆడదాన్నీ గౌరవించ లేరు, తన తల్లిని, చెల్లిని, భార్యని కూడా - వసంత బుగ్గల్లోకి ఆవిర్లు వచ్చాయి.

"ఎంతటి నెరజాణ కాకపోతే పరాయి మొగాళ్ళతో ఏమాత్రం బెదురు లేకుండా అలా మాట్లాడ

## ❋ శకునం ❋

ప్రొద్దున లేచిన
నల్లని పిల్లి
ఆహారం కోసం
బయటికి వెళ్ళింది ...

అడ్డంగా మనిషి
రావడం చూసి
నల్లని పిల్లి
దిగులు చెందింది.

"వెడుతున్న పని
అవుతుందో అవదో
పాడు మనిషి
అడ్డంగా వచ్చాడు."

అముదభారతి

## ❋ పౌరుషం ❋

అనుకున్న ప్రకారం
అన్నీ అడిగి తీసుకని
ఆ తర్వాతనే
అగ్ని ప్రదక్షిణం చేసి
మాంగల్య ధారణం చేయ
ముందుకు వచ్చిన
ఓ మహా పురుషుడా!
నిన్ను
చూడలేక సిగ్గుపడే
తల వంచుకున్నాను.
లజ్జ వల్ల మాత్రం కాదు!

మహాప్రభు

గలుగుతుంది! మా ఆవిడ కయితే పరాయి మగాడి ఎదుట పడాలంటేనే చచ్చే భయం" - ఒక వెకిలినవ్వు. నిన్ను తప్ప ప్రపంచంలో మరెవ్వరిని ఎరుగని నీ భార్య పురుషులంతా నీ లాంటి అధములేనని అపోహపడుతూ వుండి వుంటుంది. నీలాంటి 'రోగ్'ని కట్టుకున్న ఫలితమది, వసంతలో ఆవేశం ఎగసి పడుతూంది.

"నోరు మూసుకొని ఇంట్లో పడుండక ఎందుకండీ ఆ కులుకులూ, ఒయ్యారాల ప్రదర్శన?! యీ ఆడాళ్ళని..." యింక వినలేక చెవులు మూసుకుంది వసంత.

ఈ మాటలు మాట్లాడుతూంది పల్లెటూళ్ళలో రచ్చబండ దగ్గర కూర్చుని హస్కుకొట్టే చదువు, సంధ్యాలేని సోమరి పోతులు కాదు, పుకార్లని అవలీలగా వండి వడ్డించే అమ్మలక్కలూ కాదు. పవిత్రమైన వృత్తిలో వున్న గ్రాడ్యుయేట్సు, పోస్ట్ గ్రాడ్యుయేట్సు అయిన మగ 'ధీరులు.'

# వీరుడెవడు?

## కె. ముండె

(పద్ధాలుగేళ్ల విద్యార్థి, జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్)

వాడు బలశాలి
పోట్లాట యిష్టం వాడికి
తనకంటె పెద్దవాళ్ల మీదికే
ఉరుకుతాడు.
వీరుడా వాడు?

వాడో వసపిట్ట
ప్రతి ఒక్కరికీ
తన ఘనకార్యాలు
ఏకరు పెడతాడు
కాని నన్నడక్కండి
వాడు చెప్పేదాంట్లో
నిజమేదో, కానిదేదో.
వీరుడా వాడు?

వాడో పెద్ద ఛట్టీగాడు
అన్నిట్లో వాడే ఫస్టు
అయితే తాను చదివిందీ
నేర్చిందీ అంతా
తనకోసమే దాచుకుంటాడు,
వీరుడా వాడు?

వీడు మరీ బలశాలేం కాడు
కాని ప్రతి ఒక్కరికీ
సాయపడడానికి శ్రమిస్తాడు
వీడు చక్కగ మాటాడలేడు
కాని వీడి చేతలు మాటాడతాయి
చక్కగా
వీడు ఛట్టీ పెట్టడు
కాని వీడికి
జ్ఞాన తృష్ణ చాలా వుంది
తన మేలు కోసం,
సమాజం మేలు కోసమూ -
వాణ్ని వీరుడంటాన్నేను.

# అభ్యుదయ మే, జూన్ సంచికలు

జూన్ సంచికలో 'ఛాందసుడు', 'ఎసాల్ట్ అండ్ రేప్' అన్న కథల పైని పాఠకుల నుండి వచ్చిన విమర్శలను శ్రీ మహీధర రామమోహనరావు చదివి వినిపించడంతో, జూలై 2న పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ జరిపిన సమావేశం ప్రారంభమయ్యింది.

రూర్కెలా నుంచి శ్రీ మరా శాస్త్రి యిలా రాశారు: "మల్లాది వారి కథ 'ఛాందసుడు' లో తను చెప్పదలచినది ఏమిటా అని ఆలోచించా. రావి శాస్త్రిగారి భావం, మీరు కోట్ చేశారే (50 పుట, జూన్ సంచిక) 'రచయిత ప్రతివాడు తాను రాస్తున్నది ఏ మంచికి హాని కలిగిస్తుందో, ఏ చెడ్డకు ఉపకారం చేస్తుందో అని ఆలోచించ వలసిన అవసరం వుందని నేను తలుస్తా'నని. మరి మల్లాది వారు యీ కోవతో ఆలోచించి వ్రాసిందిగా నాకు అనిపించదు."

హైద్రాబాద్ నుంచి శ్రీ కె. చిరంజీవి "ఛాందసుడు ప్రచురించడం పత్రికకే తలవంపు. ఛాందసులు కాని వాళ్లు అలాంటి వాణిశ్రీలను అనుభవించ వచ్చునన్నమాట. ఛాందసులే అలాంటి ఛాన్సుని పోగొట్టు కొంటారని చెప్పే ఈ రచన మన పత్రికలో రాకుండా ఉండవలసింది. ద్రౌపదిని గురించి తెలియని ఈ రచయిత ఆమెను వ్యభిచారిణిగా చిత్రించడం అన్యాయం.

"అలాగే 'అ సాల్ట్ అండ్ రేప్' కూడా మంచి టేస్టుకి సంబంధించినది కాదు. ఆడవాళ్ల యెడ కరుణ చూపించే విధానం అది కాదని నా అభిప్రాయం. రచన కూడా బాగా లేదు. ఆ మొగుణ్ణి తెలుగు పండితుణ్ణి చేయడం, వాడు తాడుతో కొట్టడం - రచయిత ప్రాథమిక దశను తెలియ పరుస్తుంది" అన్నారు.

మరొక పాఠకురాలు "అ స్సాల్ట్ అండ్ రేప్" కథకు అసమ్మతి తెలుపుతూ "ఆ కథకు అర్థం లేదు. స్త్రీల గురించి అలాగ వ్రాయడం తప్ప మరే కథా దొరకలేదా?" అన్నారు.

జూలై సంచికలోనే ముద్రించిన మరో రెండు విమర్శలను వినిపించాక, ఆ విమర్శలను గమనికలో పెట్టుకొని శ్రీ మంథా వెంకట రమణారావు వ్రాసిన లేఖా భాగాలను చదివి వినిపించేరు.

**చర్చావేదిక**

'అసాల్ట్ అండ్ రేప్' శీర్షిక కథలో భాగమే; చిన్నప్పుడు గుణుపురంలో చదువు కొనేటప్పుడు చూసిన రెండు భిన్న ఘటనలను దీనితో జతపరచడమే తాము చేసిన పనిగా

చెప్తూ ఆయన ఇల్లా వ్రాసేరు :

"నా మనస్సు మీద చెరగని ముద్ర వేసుకొన్న కొన్ని ఘటనలను ఛెళ్లు మనేటట్లు, ఎఫెక్టివ్‌గా చెప్పడానికి సాధనం ఏమిటా అని ఆలోచించి ఈ విధాన వ్రాశాను.

"చాలమందికి నచ్చదు సార్! గట్టిగా సినికల్‌గా రాయడానికి కూడా రక్తం ఉడుకెత్తి పోవాలి . . .

"నా కథకి 'అసాల్ట్ అండ్ రేప్' అని శీర్షిక పెట్టకుండా 'బానిస బతుకు' అని పెట్టివుంటే చాల సానుభూతితో వుత్తరాలు వచ్చి వుండును. సరే. పాఠకులకి నొప్పి కలిగిస్తే, క్షమార్పణ చెప్పకోవడం తప్ప ఇప్పుడు చేయగలదే ముంది" అన్నారు (మంథా వెంకట రమణరావుగారి లేఖ యీ సంచికలోనే వుంది).

శ్రీ సెట్టి ఈశ్వరరావు మాట్లాడుతూ "రెండు కథలూ బాగున్నవనే వేశాము. ఈ విమర్శలు విన్నాక కూడా మా అభిప్రాయం అవి మంచివనే" అన్నారు. గోత్రాల చిక్కు తప్పితే వేరే అభ్యంతరంలేని ఛాందసపు అబ్బాయి 'నీతి'ని ఒక కథ ఎత్తిచూపగా, యింకోటి స్త్రీలపైని చాలా తరచుగానే జరుగుతూ వున్న రాక్షస కృత్యాన్ని అంత దారుణంగానూ వెల్లడించిందన్నారు.

శ్రీమతి కె. సుకన్యాదేవి మంథా వారి కథ బాగానే వున్నదంటూ, ఇంగ్లీషు శీర్షికకు అభ్యంతరం చేప్పేరు. ఈ మాదిరి ఘటనలు ఈనాడు చాలా చాలా అరుదని నా అభిప్రాయం అటువంటి అరుదు ఘటనను సామాన్యకరిస్తూ కథ రాయడం మంచిదా" అని ప్రశ్నించేరు.

శ్రీ జి. సి. జీని మంథా వారి కథ బాగున్నదనీ, ఇంగ్లీషు శీర్షిక కథా విషయానికి ఉద్దీప్తినిస్తూందనీ, అనువాదంగాని, మరో పేరుగాని అటువంటి ప్రభావం కలిగించదనీ అన్నారు.

శ్రీ పాండ్రంకి సుబ్రమణి రెండు కథల్నీ ప్రశంసిస్తూ మాట్లాడేరు.

శ్రీ టి. ఎల్. నరసింహారావు మొత్తం పత్రికలో రిలీఫ్ కనబడదనీ, వ్యాసాలు ఎంత ఎక్కువగా కూరగలమా యన్న ఆదుర్దా కనిపిస్తూందనీ, పత్రికను చూడ ముచ్చటగా చేయాలనీ చెప్పేరు. "వీరేశలింగానికి అద్యుడైన సంఘ సంస్కర్త అన్న వ్యాసం — ఈ పుస్తకం అచ్చయి నూటపదహారు సంవత్స రాలు గడిచాయి" అని ప్రారంభమవుతూంది, ఏమిటా పుస్తకం?

శ్రీ వై. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి పత్రికలలో అనువాదాలు ఎక్కు వౌతున్నాయన్న ప్రవాదం వుందన్నారు. ఒక భారతీయ భాష నుంచీ, ఒక విదే శీయ భాష నుంచీ వ్యాసమో కథో, కవితో ప్రచురించాలని, అలాగే ఒకో మంచి రచయితను పరిచయం చేయాలని ఒక విధానంగా పెట్టుకున్నాము ; తగిన సహ కారం అందక ఆ ఆలోచనను సరిగ్గా అమలు జరపలేక పోతున్నామని శ్రీ ఈశ్వ రరావు చెప్పారు.

శ్రీ జి. సి. జీవి ప్రసంగిస్తూ కవన శర్మగారి "మంచినడతగల కుక్క" కథను (మే నెల సంచికలో) ప్రశంసించేరు. "తిరిగిరాని కథ" వేయడం

అవసరమా అని ప్రశ్నించేరు.

తరవాత మహీధర తమ వ్యాసం చదివేరు. మనుష్య సమాజ పరిణామ క్రమంలో ఒక దశలో సగోత్ర వివాహ నిషేధం వచ్చింది. ఆ దశలో రక్తసం బంధీకుల మధ్య వివాహాన్ని నిషేదించడం అవసరం అయింది. ఆ నిషేదం పెట్ట డమే సగోత్ర వివాహాలు జరుగుతూండే వనడానికి నిదర్శనం. ఈ నాడు సమా జంలో ఆ నాటి పరిస్థితులు లేవు. సమాజ నిర్మాణం గోత్ర సంబంధాల మధ్య సాగడం లేదు. పైగా ఏకోదరుల సంతానాల మధ్య వైవాహిక సంబంధాన్ని విహితమే కాదు. అటువంటప్పుడు సగోత్ర వివాహ నిషేధం అర్థంలేనిదీ, స్త్రీ పురుష సంబంధం అంగీకరించనిదీను? శ్రీకృష్ణమూర్తి వ్రాసిన 'ఛాందసుడు' కథకు మూలం ఈ ఆలోచన.

ఆ కథను విమర్శిస్తూ ఒక పాఠకుడు "గోత్రం ఒకటి కాకపోతే వ్యభి చారాన్ని అంగీకరించ వచ్చునని రచయిత అభిప్రాయమా?" అని ప్రశ్ని స్తున్నారు. నిజానికి రచయిత వేసిన ప్రశ్నే అది. అయితే దానికి సాహిత్యం ముసుగు వేసేరు. అతర్కితమూ, అర్థరహితమూనైన ప్రశ్న తీసుకొచ్చి స్త్రీ పురుష సంబంధాలలో గోత్రం ప్రసక్తిని అపహాస్యం చేసేరు. గిలిగింత పెట్టేరు. ఇంక ద్రౌపదుల్నీ, సీతల్నీ ప్రవేశ పెట్టడం అనవసరం. తొందరపాటు ... అల్లాంటిదే అసాల్ట్ అండ్ రేప్. ఆ ఇంగ్లీషు పేరుకు కొందరు అభ్యంతరం చెప్పేరు. కాని అది సరికాదు. అదొక న్యాయశాస్త్ర పరిభాష. ఇష్టంలేని ఆడుదాన్ని బల వంతంగా అనుభవించడాన్ని శిక్షాస్మృతి నిర్వచించే విధం అది. దానికి మన భాషలో ఉద్దిష్టమైన మాట వుండడం అసంభవం. కనక మన భాషలో 'అస్సాల్ట్'కీ, 'రేప్'కీ పదాలుంటే ఉండొచ్చు, కాని వాటికి సామాజిక ధర్మం ఇచ్చే బలం వుండదు. ఆ బలం కావాలనేదే రచయిత అభిప్రాయం.

కొందరకి కథలో ఆసామీ తెలుగు పండితుడు కావడం అభ్యంతరం అయితే మరొకరికి పెళ్ళాన్ని కన్నెతాడుతో కొట్టడం అర్థంలేనిదిగా కనిపించింది. కథలో ప్రధాన సమస్య సమాజం ఆడుదాని మీద మగవానికిచ్చిన సర్వతోముఖ ప్రభుతకుకు అసమ్మతీ, అసహ్యమూను. ఆ హింసకు చెయ్యికూడా అడ్డం పెట్టలేని, అడ్డం పెట్టే వూహని కూడా తోపించనీయని విధంగా మన మనస్సులు కండిషన్ చేయబడి పోయాయనే ఆక్రోశం కథకునిది.

భార్యా భర్తల మధ్య సంబంధాలకు కూడ ఆ శబ్దాలను ఉపయోగిస్తారా? అని శ్రీమతి సుకన్యాదేవి అడిగిన ప్రశ్నకు, వక్త భార్య అటువంటి ఘట్టాలలో కోర్టు రక్షణ కోరేదీ, విడాకుల హక్కు కోరేదీ, ఆ సామాజి కార్థం బలంతోనే అని సమాధానం చెప్పారు.

"ఆమె నోరెత్తలేదు. ఆమె ఎన్నో పతివ్రతల కథలు చదివింది. పెళ్లి చేసు కొన్నాక పతే దైవం అని ఆమె పురాణాలు ఘోషించేయి"... ... అన్న పేరా ఆ కథకు కీలకం.

అయితే ఇక్కడ ఒక ముఖ్య విషయాన్ని చెప్పడం అవసరం, రచయిత

మన దుష్ట సంప్రదాయాల మీద వున్న తీవ్ర అసహ్యాన్ని అంత తీవ్రమైన సినికల్ ధోరణిలో వ్యక్తపరచడమే ఈ కథపై వచ్చిన విమర్శలకు కారణం అయిందని భావిస్తున్నానని వివరించారు.

తరవాత శ్రీ జి. సి. జీవి తన సమీక్ష చదివారు: ఎనిమిది పుటల బులెటిన్‌గా ప్రారంభమై ఈ నాడు 52 పేజీల మాసపత్రికగా మన ముందుంది 'అభ్యుదయ'. ఎన్నో ఇబ్బందుల నెదుర్కొంటూ పత్రికను ప్రతి నెలా క్రమం తప్పకుండా సకాలానికి వెలువరిస్తున్న నిర్వాహకుల కృషి అభినందనీయం.

పసి పాపల్లోని స్వచ్ఛతనీ, అమాయకత్వాన్ని తన బోసి నవ్వులో నింపుకుని పలకరించే కృష్ణశాస్త్రి ముఖ్యచిత్రం ముసలి తారల జిడ్డు మొహాలతో మొహం మొత్తిపోయిన తెలుగు పాఠకుడికి ఒక పెద్ద రిలీఫ్. వ్యాసాల్లో కృష్ణశాస్త్రి కవితల మీద పద్మరాజుగారి వ్యాసం ఫరవా లేదనిపించినా; శీర్షికలో పేర్కొన్నట్టు నవ్యాంధ్ర సాహిత్యం మీద ఆయన ప్రభావాన్ని గురించి వ్యాసంలో వివరించకపోవడం వెలితిగా అనిపించింది. తరువాత తరం కవులకు గేయ రచయితలకు కృష్ణశాస్త్రి ఏ విధంగా మార్గదర్శకుడయ్యారు అనే విషయాన్ని చర్చించి వుంటే అసలైన విమర్శనాత్మక వ్యాసం కాగలిగేది. ఏ తెలుగు పత్రికా అందించని సమాచారాన్ని పాల్ రాబ్సన్‌ని గురించిన కాట్రగడ్డ గంగయ్యగారి వ్యాసం అందించింది. వ్యాసాల్లో 'మధ్య తరగతి మనస్తత్వం', 'చలనచిత్రాల ప్రభావాలు' నాకు బాగా నచ్చాయి. 'సారస్వత వివేచన', 'తెలుగు అకాడమీ - భాషా పరిశోధన', అనే వ్యాసాలు ఉపయుక్తంగా వున్నవి. 'మంచి నడతగల కుక్క 'ది గ్రేట్ హీరో', 'పరదా' కథలు బాగున్నాయి. హాయిగా కథ వ్రాసుకోకుండా ఈ గేయ రచనల పిచ్చి ఎందుకు చెప్మా ఈ యనగారికి – చూడుడు: 45 వ పుటలో మల్లాది వెంకట కృష్ణమూర్తిగారి గేయం. కవితలో ఉపద్రష్ట సాయిగారి 'కూలీలు' పత్రికకే హైలైట్. ఇలాంటి కవిత ఒక్కటి చాలు ప్రత్యేకతలేని గేయాలు పది వెయ్యడం కన్న. సోమసుందర్‌గారి 'కాలం వీలునామా' గందర గోళంగా వుంది. కొరుకుడు పడలేదు. దేని కోసం, ఎవరి కోసం రాశారో మరి.

జూన్ సంచిక పద్మరాజు, శ్రీ శ్రీ ముఖచిత్రంతో వెలువడటం ముదావహం. ఇలాగే వీలైనపుడల్లా సాహితీజగత్తుకు సంబంధించిన ప్రముఖుల్ని (ఏ భాష వారైనా సరే) ముఖచిత్రాల ద్వారా పరిచయం చేస్తే సముచితంగా వుంటుంది. గేయాల్లో ప్రసన్న కుమార్‌గారి 'ఆధునిక రాజకీయం' తెలుగు కథల్లో మంథా వెంకట రమణరావుగారి కథానిక, అనువాద కథల్లో జాక్ లండన్ కథ చెప్పుకోదగినవి. విశ్వ సాహిత్యంలో వుత్తమమైన కథల్ని అనువదించి ప్రతినెలా పరి

## చిరునామా మార్పు

'అభ్యుదయ'కు సంబంధించిన ఉత్తరాలు, పంపే రచనలు; మని ఆర్డర్లు, డ్రాఫ్టులు, చెక్కులు మొదలైనవి యీ దిగువ చిరునామాకు పంపవలసిందిగా విజ్ఞప్తి.

ABHYUDAYA,
R - 3, Llyods Estate, Madras – 600 014.

చయం చేయడం మంచిది. వ్యాసాల్లో 'దిగంబర కవిత', 'ట్రాజెడీకి మూలం', ''కృష్ణా తీరం'' గురించి పరిశీలన బాగున్నాయి.

చివరగా అభ్యుదయ రచయితల సంఘానికొక చిన్న సూచన. ప్రతి నెలా తెలుగు పత్రికల్లో వెలువడే కథల్ని సమీక్షించి వాటిలోంచి ఆ మాసపు వుత్తమ కథగా ఒక దాన్ని నిర్ణయించి ప్రకటిస్తే బావుంటుంది. సౌలభ్యం కోసం ఒక నెల్లో వార పత్రికల్ని, మరొక నెల్లో మాస పత్రికల్ని ఎంచుకోవచ్చు. అలా ఏడాది పొడుగునా ఎంపిక చేసిన 12 కథల్లోంచి తెలుగు సంవత్సరాది నాడు ఆ సంవత్సరపు వుత్తమ కథగా ఒక దాన్ని నిర్ణయించి ఆ రచయిత నాహ్వానించి చిన్న బహుమతి ప్రధానం చేయడం సముచితంగా వుంటుంది. కథల్ని చదివి సమీక్షించి ఆ నెలలో వుత్తమ కథగా నిర్ణయించే బాధ్యతను ఒకరికి అప్పగించవచ్చు. పన్నెండు కథల్లోంచి సంవత్సరపు వుత్తమ కథను ఎంపిక చేసే బాధ్యతను ఒక రచయితకో, విమర్శకునికో ఇవ్వవచ్చును. అనుకూలిస్తే ఇలా ఎన్నికైన పన్నెండు నెలల కథలనూ ఒక సంపుటంగా కూడా వెల్వరించవచ్చు. ఈ పథకాన్ని మద్రాసులోని 'ఇలక్కియ చిందనై' (సాహితీ సమాలోచన)అనే తమిళ రచయితల సంఘం సుమారు ఒక దశాబ్దం నుంచీ సమర్థవంతంగా నిర్వహిస్తోంది. ఈ పథకం గురించి తీవ్రంగా ఆలోచించాలని అభ్యర్థిస్తూన్నాను.

అగస్టు 6 న జరగబోయే చర్చలో విశాలాంధ్ర ప్రచురణాలయం వారి 1978 నవలల పోటీలో బహుమతులు పొందిన ''బలిపశువు'', ''కోటి కుటుంబాల ఘోష'', ''సంకెళ్లు తెగుతాయి'' అన్న నవలల మీద చర్చ జరుగుతుందని, చర్చ ముగిశాక ప్రకటింపబడింది.

## సమీక్ష

### స్వేచ్ఛ!

జెయిలు కవితలు

వరవరరావు

వెల : రెండున్నర రూపాయలు.

ప్రజలకు: సృజన,

హనుమకొండ, వరంగల్ - 506 001.

విప్లవ రచయితల సంఘంలో ప్రముఖుడైన వరవరరావు 1974 మే నుండి మార్చి 77 వరకు జయిళ్లలో రాసిన 36 గీతాల సంపుటం యిది. 'దండయాత్ర' అన్న శీర్షికతో మావో గీతానికి తెలుగు అనుసరణ, యీ సంపుటంలో, ఎరుపు రంగులో, తొలి పుటలలో ప్రముఖంగా ముద్రింపబడింది. 'మావో ఆలోచనా విధానం వర్ధిల్లుతోంది' అన్న శీర్షికతో వున్నది, యింకో గీతం. విప్లవ రచయితలు మావో ఆలోచనా విధానానికి అంకితమైన వారు కాబట్టి, యీ సంపుటమంతటా ఆ ముద్ర అడుగడుగునా కనిపిస్తుంది.

అయితే విప్లవ రచయితలు తాము మార్క్సిస్ట్ - లెనినిస్టులమని కూడా చెప్పుకుంటారు. విప్లవ రచయితలకు మార్క్సిజం - లెనినిజం, మావోయిజం సరిపడని సంగతులన్న సత్యం సమ్మతంకాదు. మావోయిజం ఆచరణలో యీ వైరుధ్యం నానాటికీ స్పష్ట మవుతోంది;

యీ నాడయితే మరీ తేటతెల్లమయ్యింది. అయినా 'మావో ఆలోచనా విధానం' వారికి శిరోధార్యం. వరవరరావు గారి గీతాలు యిందుకు రుజువుగా వున్నాయి.

ఈ కవి భావనలో 'మావో ఆలోచనా విధానం మన జ్ఞాననేత్రం' (చూ.పుట 10). ఈ జ్ఞాననేత్రాన్ని తెరచి కవి చూసిందేమిటి? కవి రష్యా మీద లెనిన్‌కు చేసిన ఫిర్యాదు దీనిని చూపుతుంది: "..నీ స్వప్నాన్ని పాతేసి శవాన్ని పూజిస్తున్నారు"!

కాని వరవరరావు జ్ఞాననేత్రంతో చూసిన దానికి భిన్నమైన దృశ్యం, మావో ఆలోచనా విధానం ఊబిలో కుత్తుక వరకు దిగిపోయిన వారికి తప్ప, యింకెవరికైనా కనిపిస్తుంది. ఇందుకు దోపిడి వర్గాల వారు, సోవియట్ దేశానికి ఆగర్భ శత్రువులు సైతం మినహాయింపు కాదు. వీరు సైతం రష్యా ప్రజలు సిరిసంపదలతో తాము తులతూగడమే కాక, పది - పదిహేను సోషలిస్టు దేశాల ప్రజలూ, సామ్రాజ్యవాద దోపిడికి గురి అయి కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొందిన ఎన్నో దేశాల ప్రజలూ వర్ధిల్లడానికి సాయపడుతున్నారనీ అంగీకరించక తప్పలేదు. ఇదేకాదు, సామ్రాజ్య వాదుల, వారి తాబేదారుల కుట్రల వల్ల రకరకాల ఆపదలకు గురి అవుతున్న పలు దేశాల ప్రజలను సోవియట్ ప్రజలూ, యితర సోషలిష్టు దేశాలప్రజలూ ఎన్నో విధాల ఆదుకుంటున్నారు. లెనిన్ కీర్తిశేషుడైన తరువాత జరిగిన విప్లవకర పరిణామాలివి. వరవరరావు గారికి జ్ఞాననేత్రాన్ని ప్రసాదించిన మావో సైతం, సోవియట్ దేశం చేయూత నివ్వడం వల్లనే చైనాలో విప్లవం సాధ్యమయ్యిందని ఒకప్పుడు కృతజ్ఞత ప్రకటించడం జరిగింది. కాని తరువాత కొన్ని కొన్ని మనో వికారాలవల్ల అవి విస్మరింపబడి, బద్ధ వైరం కల్పింప బడింది. ఈ వారసత్వాన్నే విప్లవ కవులు సంక్రమించుకున్నారు. తత్ఫలితంగా చేసినదే, యీ విరసం కవి లెనిన్‌కు చేసిన ఫిర్యాదు.

ఈ జ్ఞాననేత్రాని కెటువంటి నిశిత దృష్టి వుందంటే – సోవియట్ నృత్య నాటక బృందం సంవత్సరాలుగా తమ దేశంలో ప్రదర్శిస్తోన్న రామాయణ నాటకం ఢిల్లీలో ప్రదర్శించడం, యీ దేశంలోని హిందువుల్ని ఆనందింప చేయడానికి, అంటే బుట్టలో వేసుకోవడానికి జరిగిన కుట్రగా కనిపించింది! (పుట 24)

ఈ జ్ఞాననేత్రంలో రెండు రకాల తిరుగుళ్లున్నాయి. అది వున్నది లేనట్టుగా చూపిస్తుంది, లేనివి ఉన్నట్టుగాచూపించి నట్టుగానే. దీని మహిమవల్ల, మావో ఆలోచనా విధానం ఊబిలో దిగి పిడివాదులవడానికి యిష్టపడని వారు "మార్క్సిజం మాటల్లో వర్ణించే కొజ్జాలుగా" కనిపించారు యీ కవికి (చూ. పుట 50). "'జాతీయ కమ్యూనిస్టుల', విప్లవం నిర్ధాక్షిణ్యంగా సాగే వర్గపోరాటం కాదు సర్దుబాటులో వచ్చే భిక్షాందేహీ మాదాకబళం" అన్న వక్రభాష్యానికి కారణం బుద్ధిజాడ్య జనితోన్మాదమేనని గ్రహించడం; ఇన్‌స్టంట్ కాఫీ లాంటిదే ఇన్‌స్టంట్ విప్లవం అన్న అవగహనకు వశుడైపోయిన యీ కవికి సాధ్యం కానిపని. కాని తన ఆలోచనా ధోరణికి జనకుడైన మావో, అంతర్యుద్ధ కాలంలో చైంగ్ కై షేక్‌తో చేసుకున్న

'సర్దుబాటు' కూడా 'భిక్షాందేహీ మాదా కబళం'గా జమకడితే ఆయన అంగీకరిస్తారా ?

దుందుడుకు చర్యలవల్ల, పిడివాదపు ఆలోచనల వల్ల మన దేశ చరిత్రలోను అనేక యితర దేశాల చరిత్రలలోను, ప్రజోద్యమాలూ, విప్లవోద్యమాలూ చావు దెబ్బలు తిన్నాయి. ఉదాహరణకు ఇండొనేషియాలో మావో ఆలోచనా విధానాన్ని అనుసరించి జరిగిన దుందుడుకు చర్య ; ఈ దేశంపైని 1962 లో మావో చేయించిన దండయాత్ర తదనంతరం, ఆయన ఆలోచనా విధానాన్ననుసరించి కమ్యూనిస్టు ఉద్యమంలో పరంపరగా వచ్చిన చీలికలు. ఈ అనుభవాలనుండి విప్లవ కవులు గుణపాఠం నేర్చుకోడానికి సమ్మతించరు. ప్రజలు లేని ప్రజాయుద్ధం కోసం నినాదాలు చేస్తూ; ప్రజలులేని ప్రజా యుద్ధం నేలవిడిచిన సాము వంటిదన్న సామాన్య సత్యాన్ని గ్రహించకుండా, కాని యిదే అసలు సిసలయిన మార్క్సిజం — లెనినిజం అని బూకరిస్తూ ; అటువంటి పదార్థాన్నే కవిత్వంగా చెలామణీ చేస్తూన్నారు. ఇటువంటి కుహనా విప్లవ కవిత్వానికి సరికొత్త మచ్చుతునక వరవరరావుగారి 'స్వేచ్ఛ'.

గతంలో భావకవుల ఉత్తుత్త ఊహా ప్రేయసి వంటిది, వీరి విప్లవ స్వప్న సుందరి. విప్లవంకోసం శ్రామికవర్గ సంకల్పం, సన్నాహం, సన్నద్ధత, కష్ట జీవుల సమీకరణ వీరి ఊహలో లేవు; వీరి ఊహాకందవు కూడా. మావో ఆలోచనా విధానాన్ని నమ్ముకొని, మతిచెడి వ్యక్తుల హననమే విప్లవ పంథాగా భ్రమిస్తూ —

"వర్గాలకు సంఘర్షణ
అనివార్యం — శాస్త్రీయం
ప్రజా యుద్ధ పంథాయే
సాధించును శ్రమరాజ్యం"

(పుట .7)

— అన్నది వీరి నమ్మకంగా ప్రకటించబడింది. కాని తమ 'ప్రజాయుద్ధ పంథా' లోపల ప్రజలు లేరన్నది వీరి గమనికలోనికి రాలేదు.

పాకిస్తాన్ రాక్షస పరిపాలన నుండి విముక్తికోసం చావు బతుకుల పోరాటం సాగించిన తూర్పు బెంగాల్ ప్రజోద్యమాన్ని వీరు తమ రచనలో వ్యతిరేకించారు. చిన్న రాష్ట్రాలైతే విప్లవ సాధనకు సులువుగా వుంటుందన్న ఒక సిద్ధాంతం చేసుకొని ప్రత్యేకాంధ్రోద్యమాన్ని వీరు సమర్థించేరు. ఇటువంటి వక్రమార్గాలు వీరి మనోవైకల్యాన్ని తెలుపుతాయి; మావో ఆలోచనా విధానం వీరిని ఎటువంటి యిరుకు సందుల్లోకి తీసుక వెళ్లిందో చూపుతాయివి.

భారత దేశంపైని 1962లో చైనా దండయాత్ర చేసిన తరవాత చీలిన మార్క్సిస్టు పార్టీ నుండి తాము చీలిపోయి, తరువాత రాను రాను గాంధారి పిండంలాగ వీరు నూరు ముక్కలయిపోయారు. తమలో తాము హత్యలకు పాల్పడ్డారు. వర్గశత్రుసిర్మూలనం స్వజన హననంగా పర్యవసించింది. ఇప్పుడు వేరు వేరు పొయ్యలు పెట్టుకొని స్వయంపాకం చేసుకొంటున్నారు. స్వకుల పౌరోహిత్యాలు సాగిస్తున్నారు. తెలుగు విప్లవ రచయితల సంఘమూ ముక్కలయ్యింది.

మితవాద రాజకీయ పక్షాలు దోపిడీ విధానానికి అనుకూలంగా సాగిస్తున్న

పరిపాలనను అంతం చేసి కష్టజీవులకు అనుకూలమైన పరిస్థితులను కల్పిం చేందుకు తొలిమెట్టుగా, వామపక్షాల ఐక్యత కోసం యిప్పుడు కొంతగా కృషి దేశంలో జరుగుతోంది. ఇందుకు విరసం, దాని రాజకీయ పక్షం ఎంత వరకూ సమ్మతిస్తాయో తెలియదు. వరవరరావు 'ఐక్యత' అన్న గీతంలో (పుట. 9) ప్రకటించినది యిందుకు సముఖత అవునో కాదో స్పష్టంగా లేదు. "కామ్రేడ్స్! ఇంకా గొప్ప విజయాలు సాధించడం కోసం ఐక్యమవుదాం, శ్రామికవర్గనియంతృత్వ స్థాపనకు ఐక్య మవుదాం, నూతన ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడంకోసం ఐక్యమవుదాం!"

"కామ్రేడ్స్"! అన్న సంబోధన పరిమితి ఏమిటో? కేవలం మావో ఆలో చనా విధానాన్ననుసరిస్తోన్న బృందా లన్నిటికీ వర్తిస్తుందా, లేదా వాటిలో ఒక ప్రత్యేక బృందానికి మాత్రమే వర్తిస్తుందా, లేదా వామపక్ష భావాలున్న వారందరికీ వర్తిస్తుందా?

"ఇంకా గొప్ప విజయాలు సాధిం చడం కోసం ఐక్యమవుదాం" అన్న పంక్తిలో గొప్ప విజయాలు యిప్పటికే సాధించ బడ్డాయన్న ధ్వని వుంది. సాధింపబడిన ఆ గొప్ప విజయా లేమిటో కవి పేర్కొనలేదు.

అయితే "ఐక్యత" అన్న గీతానికి "ఆధారం చైనా కమ్యూనిస్టు పార్టి 10వ కాంగ్రెసు డాక్యుమెంట్లు" అని చెప్ప బడింది. గీతంలో, పైని చెప్పబడిన "జ్ఞాన నేత్రం" ప్రస్తావన కూడా వుంది. అంచేత యీ ఐక్యత అన్నది. అనుమానానికి అతీతంగా లేదు.

మావో ఆలోచనా విధాన జన్యమైన ఐక్యత తీరు తెన్నులు ప్రపంచానికి అను భవమైనవే: పూర్వ కాలంలో చైనా చక్రవర్తుల ఏలుబడి క్రిందనున్న ఇతర దేశాల భూభాగాల కోసం వాదోప వాదాలు; ఇరుగు పొరుగు దేశాలన్నిటి తోను తగాదాలు; నిర్జనమైన పర్వత ప్రాంతాల కోసం భారత దేశం పైని దండయాత్ర, భారత కమ్యూనిస్టు పార్టీ విచ్ఛిన్నత; సోవియట్ దేశం తోనూ, ఇతర సోషలిస్టు దేశాలతోనూ శతృత్వం; అమెరికా మొదలయిన పెట్టు బడిదారీ, సామ్రాజ్యవాద దేశాలతో; మైత్రి; వియత్నాంతో సంఘర్షణ; చివరికి అల్బేనియాతో కూడా తెగతెంపులు.

మేధో పక్షాళనానికి గురై, మావో ఆలోచనల నుండి బయటికి రానంత కాలం విప్లవరచయితల విప్లవనినాదాలు వాగాడంబరాలుగా, సంధి ప్రలాపాలుగా మాత్రమే మిగిలి పోక తప్పదు. పది పదిహేను సంవత్సరాల తమ అరాచ కాల అనుభవం నుండి వీరు నేర్చు కున్నది తక్కువ. ప్రజలు లేని ప్రజా యుద్ధం, ఆత్మవంచన అన్న సత్యాన్ని వీరింకా తెలుసుకోలేదు. విప్లవం తుపాకి గొట్టంనుంచి మాత్రమే రాదు; ప్రప్రధా నంగా ప్రజల సంకల్పంనుండీ, సమరం నుండి వస్తుంది. విప్లవాభిలాషులంతా అందుకు పూనికతోనూ, ఐక్యతతోనూ పాటుపడాలి. అడ్డదారులు తొక్కడంవల్ల వచ్చిన విచారకరమైన అనుభవం నుండి గుణపాఠం నేర్చుకోవాలి. మావో ఆలో చనలు చైనాలో, ప్రపంచంలో చేసిన చెడుగును, పిడివాదాన్ని వదిలి పరిశీలిం చాలి. మార్క్సిస్టు, లెనినిస్టులకు శిరో ధార్యమైన విమర్శ, ఆత్మ విమర్శలను చిత్తశుద్ధితో చేపట్టాలి.

# లేఖలు

## విమర్శలకు జవాబు

జూన్ నెల అభ్యుదయలో అచ్చయిన, ''ఎసాల్ట్ ఎండ్ రేప్'' అందవికారంగా అగుపించినట్టుంది – క్షంతవ్యుణ్ణి!

దానికి ఆంగ్లంలో పతాకం తగల్చడానికి కారణం, భార్యనైనా సరే తన్నడం, ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా అనుభవించడం ఇండియన్ పీనల్ కోడ్ ప్రకారం ఎసాల్ట్, కిందా రేప్ కిందా వస్తాయని చెప్పడం – అది లీగల్ టెర్మినాలజీ.

భార్యని గొడ్డులా చూసే భర్తలు మన సమాజంలో చాలా మంది ఉన్నారు – గొడ్డులా చాకిరీ చేయించుకొని, కోపమొస్తే గొడ్డులా బాది, కామం పుట్టినదే తడవుగా గొడ్డు మాదిరి తీర్చుకొనే మగాళ్ళు మన భారతీయ సమాజంలోనే కాదు, విదేశాల నాగరికులలోనూ ఉన్నారు – కాని వారిలో ఆడది విడాకులిస్తుంది! మనలో ఆడది చచ్చినట్టు పడుంటుంది!

భార్యని జుత్తుపట్టి, ఈడ్చి బూతులు తిడుతూ తన్నే సంఘటనలు నేనే కాదు, మీరూ చూసే ఉంటారు – చూలాలిని పలుపు తాడుతో కొట్టడం నాకు తెలుసు. ఒంట్లో బాగో లేదు మొర్రో అంటున్నా వినక తన కామాన్ని తీర్చుకోగా, రాత్రిల్లా ఏడ్చే ఆడవాళ్ల మూల్గులు నేను విన్నాను – ఎలా విన్నానా? పక్క పక్కని అద్దె కున్నప్పుడు దాగే రహస్యాలు ఏవీ ఉండవు ... ముఖ్యంగా తిట్లూ కొట్లూ.

ఆ రచన జుగుప్స కలిగించిందన్నారు – థాంక్స్! అటువంటి కిరాతక చర్యలు చూసి నాలో కలిగిన జుగుప్స రచనలో ప్రతిబింబించడంలో కృతకృత్యుడయినట్టే లెఖ్ఖ. ఔను! ఈ రచన చాలా అందవికారమైనదే! ఒప్పుకుంటాను! కాని అటువంటి జీవితంలో ఇరుక్కున్న స్త్రీ జీవితం అందంగా ఉంటుందని పాఠకుల అభిప్రాయమా?

నా పద ప్రయోగ ధోరణి మార్చుకోవడం అవసరం అన్నారు ''ఒక పాఠకుడు''. చాలా జుగుప్సగా ఉందన్నారు ఉపమానాలూ, పదజాలం – నేను ఇందులో పదాలు అతి పొందికగా వాడేను – అసభ్యమైన పదాలు వాడలేదు.

అయితే ఇదే కథని ''బానిస బతుకు'' అన్న పతాకను పెట్టి సెంటిమెంటల్‌గాను కన్నీటి గాథగానూ, పాత్రలకి పేర్లు తగిలించి నాలుగు పేజీలు రాయగల రచయితలున్నారు – వారిలో ఒకణ్ణి కాలేకపోవడం నా దురదృష్టం! అలా రాయడం తప్ప తెలుగు రచయితకి మరో మార్గాంతరం లేదని పాఠకులు అన్ననాడు నా వంటి రచయితలు రాయడం మానుకోవడం ఉత్తమం అని గుడ్‌బై కొట్టేస్తారు – అందువల్ల తెలుగు సాహిత్యానికి ఏమీ నష్టం ఉండదు. తెలుగు సాహిత్య కన్యకి ఛత్రాజుతే కావాలి తప్ప, నిజం చెప్పే వారంటే ఎలర్జీ లెండి మరి!

మంథా వెంకటరమణరావు రూర్కెలా


## సోవియట్ సమీక్ష

ఇంగ్లీషు, తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం, యింకా మరో ఏడు యితర భారతీయ భాషల్లో మాసానికి ఐదు సంచికలు ప్రకటించబడుతూన్న సమగ్ర పత్రిక.

సైద్ధాంతిక విషయాల గురించీ, సోవియట్ దేశంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిణామాలకు సంబంధించిన వివిధ అంశాల గురించి సవివరంగా తెలియచెప్పే పత్రిక. నేడు తగ్గింపు రేట్లకు లభిస్తూ వుంది.

సంవత్సరం చందా : రు. 4.00

మూడు సంవత్సరాలకు : రు. 10.00

మీ చందాలను మనియార్డరు ద్వారా గానీ, క్రాస్ చేసిన పోస్టల్ ఆర్డర్ ద్వారా గానీ ఈ క్రింది చిరునామాకు సరాసరి పంపండి.

సోవియట్ భూమి కార్యాలయం,
115, త్యాగరాయ రోడ్డు,
మద్రాసు – 600 017.

## కఠిన విమర్శల కత్తి

అసంఖ్యాకంగా యీనాడు ఔత్సాహిక రచయితలు ప్రగతిశీలమైన రచనలు చేస్తున్నారు. ఇంకోవేపున, ప్రతిష్ఠ సంపాదించుకున్న అభ్యుదయ రచయితలు ఒక పాదం అభ్యుదయం పడవలోనూ, రెండో పాదం ధనార్జన పడవలోనూ పెట్టి, తమ రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు. ప్రతిఫలం ముట్టచెప్పలేని పత్రికలకి వీరు తమ రచనలు పంపరు. పంపినా అవి మొక్కుబడికి రాసినట్టుంటున్నాయి.

అటువంటప్పుడు ఉత్సాహవంతులైన కొత్త రచయితలను ప్రోత్సహించి వృద్ధిలోకి తీసుకురావలసిన బాధ్యత ప్రగతిశీల పత్రికలది. ఈ విషయంలో 'అభ్యుదయ' గణనీయంగ వీరికి ప్రోత్సాహాన్నిస్తోంది. రచయితలు కొత్తవారైనప్పుడు విషయ పుష్టివున్నా, శిల్ప పరంగా లోపాలుండవచ్చు. వాటిని వివరించి వారిని సరైన మార్గంలో పెట్టడం ప్రగతిశీల విమర్శకుల బాధ్యత కాని 'అభ్యుదయ' జూలై సంచికలో (లేఖలలో "కఠిన విమర్శ") కొత్త రచయితల మీద అవహేళన ధోరణిలో విరుచుక పడడం జరిగింది. కొండంత ఉత్సాహంతో సమాజపు ప్రగతిని కాంక్షిస్తూ ఏదో చెప్పాలన్న తహతహతో ముందుకు వస్తున్న కొత్త గొంతులను నొక్కివెయ్యకండని ఆ కఠిన విమర్శకునికి నా మనవి. దీని కంటె రచనలలోని బాగోగులను, శిల్ప రీతులను వివరిస్తే నూతన రచయితలకు వెలుగు చూపిన వారవుతారని నా విన్నపం.

'స్రవంతి' విజయవాడ

## సూచనలు

'అభ్యుదయ' లో విషయసూచికను పెట్టడం ఒక ఇంప్రువ్‌మెంట్. కథానికలు మరీ జాస్తిగా వున్నాయి. అలాగే గేయాలు కూడా. కొమర్రాజు జీవిత చరిత్ర మీద సమీక్ష బాగుంది కాని చాలా కురచగా వుంది. తిరపతి వెంకటకవుల నుండి, లేకపోతే వీరేశలింగం గారి నాటినుండి శ్రీ శ్రీ వరకూ వచ్చిన మహారచయితల గూర్చి, వారి ఎచీవ్‌మెంట్స్ గూర్చి 2 పేజీల వ్యాసాలు ఒక రెగ్యులర్ ఫీచర్ చేస్తే బాగుంటుందేమో? అలాగే తెలుగు వాగ్గేయ కారులు (కీర్తనలూ, కృతులూ, భక్తి గీతాలూ, జావళీలూ) రాసిన వారి మీద, వారి కవితలోనున్న సొగసులు చూపుతూ వ్యాసాలు కూడా అవసరమని నా ఉద్దేశం. కూచిపూడి నృత్య, కవితా ఘనతల గురించిన్నీ, నారాయణ దాసుగారి హరికథల గురించిన్నీ, ఆయన ఎచీవ్‌మెంట్స్ గురించిన్నీ వ్యాసాలు అవసరం.

ఒక పాఠకుడు ఢిల్లీ

## విమర్శ - దూషణ

'అభ్యుదయ' పేజీలు పెరగటం సంతోషకరం. కొన్ని పేజీలను సాహితీ చర్చలకు కేటాయిస్తే మంచిదేమో. కాని దానిని నడిపేటప్పుడు సంపాదకులు కాస్త గట్టిగా వుండాల్సి వుంటుంది. ఎంచేతనంటే మన వాళ్లకి విమర్శకి, దూషణకి అట్టే తేడా తెలియదు. దూషణ రాకుండా విమర్శ వరకే పరిమితం చేయాలి.

రమేష్ కొత్త ఢిల్లీ

### సవరణ

'అభ్యుదయ' జూలై సంచిక 20 - 21 వ పుటలలో సమీక్షింపబడిన గ్రంథం పేరు 'హిత సూచని' అని గమనించవలసిందిగా మనవి. పేరు ప్రారంభంలో లేకుండా, మధ్యను వుండడం వల్ల పాఠకులకు చికాకు కలుగుతుంది. ఇందుకు చింతిస్తున్నాము.

(- సం.)

### సాహిత్య గోష్ఠి

విశాలాంధ్ర ప్రచురణాలయం పోటీలో బహుమతులు పొందిన మూడు నవలల సమీక్ష

అగస్టు 6 (ఆదివారం)

సాయంత్రం 6 గంటలకు

పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో

ABHYUDAYA August 1978 Regd. No. TN. MS. (c) 289


# విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

## * 1978 నవలల పోటీలో బహుమతి పొందినవి *

**బలిపశువు :**

ఇది పూనమ్మ కథ. తన వ్యక్తిత్వాన్ని, అభిమానాన్ని గూడెం కట్టడిలో దొరల ముట్టడిలో కోల్పోయిన ఓ మహిళ ఆర్త గాథ. గ్రామీణ జీవితంలో యీనాటికీ సాగుతున్న దొరల అత్యాచారాలకి అద్దం పట్టిన నవల.

రచన : జాతశ్రీ (ద్వితీయ బహుమతి) రు. 5-00

**కోటి కుటుంబాల ఘోష :**

ఊరికి పెడగా, వెలిగా వున్న మాల మాదిగ గూడేలు ఈ నవలకు నేపథ్యం. అక్కడి జనం సాగిస్తున్న వలస జీవితం, అనుభవిస్తున్న పీడన, దోపిడీ యిందులో అత్యంత సహజంగా, వాస్తవికంగా చిత్రించబడ్డాయి.

రచన : కె. బ్రహ్మానందరావు (తృతీయ బహుమతి) రు. 6-00

**సంకెళ్ళు తెగుతాయి :**

శ్రమవీరులతో, వారి భావాలు, ఆశయాలు, ఆశలు, ఆకాంక్షలతో మమేకమైన నవల. చిన్న, పెద్ద కార్ఖానాల్లో పనిచేస్తున్న కార్మికులు-అనేక మంది యిందులో కనిపిస్తారు. పారిశ్రామిక రంగం, జీవితం కేంద్ర బిందువుగా వెలువడిన ఈ తరహా నవలల్లో బహుశా యిదే మొదటిది.

రచన : మల్లిక్ (కన్సొలేషన్ బహుమతి) రు. 6-00

## * 1977 నవలల పోటీలో బహుమతి పొందినవి *

**దేవుళ్లారా మీ పేరేమిటి :**

రచన : శ్రీకాంత్ (ప్రథమ బహుమతి) రు. 6-00

**కన్నీటికి నోరొచ్చింది :**

రచన : ఎస్. కాశీవిశ్వనాథ్ (ద్వితీయ బహుమతి) రు. 6-00

**తృతీయ బహుమతి !**

రచన : డా. పరుచూరి రాజారామ్ (తృతీయబహుమతి) రు. 6-00

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
చంద్రం బిల్డింగ్స్, విజయవాడ - 520 004

విశాలాంధ్ర బుక్ హౌస్ : విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్టణం, తిరుపతి, వరంగల్, అనంతపూర్, గుంటూరు.


Edited and Published By T. Venkataramiah, at 15, Arulammal Street.